**First Published 1971 (*Saka* 1893)**
**Reprinted 1987 (*Saka* 1909)**



రూ
R




AS THEY SAW INDIA *(Telugu)*

*Translator*

**Balantrapu Rajani Kantha Rao**

ఛాయా చిత్రాలు

ఆర్కియాలజికల్ సర్వే ఆఫ్ ఇండియా సౌజన్యంతో

Published by Director, National Book Trust, India, A-5, Green Park, New Delhi 110016 and printed by Gautam Packaging, B-29, Okhla Industrial Area, Phase I, New Delhi 110020

# మెగస్తనీస్ నాటి భారతదేశం

ఇతర దేశాల ప్రజలు మనలను గురించి ఏమనుకుంటూంటారో! తరచుగా కుతూహలాన్ని కలిగించే ప్రశ్న కాదూ ఇది? అందుచేత, ఎన్నోవేల యేళ్ల క్రితం మనదేశానికి వచ్చి వ్రాసిన యాత్రికుల వ్రాతలను వొళ్ళు మరిచిపోయేటట్లు చదివి, నేటి యాత్రికుల వ్రాతలతో పోల్చి చూసుకుంటూంటాము. ఈ యాత్రికుల గాథలు మరొకందుకు కూడా మనకు ఇష్టం కలిగిస్తాయి. ప్రాచీనకాలపు భారత దేశ చరిత్ర తయారు చేయడానికి పనికి వచ్చే మూలాధారములయిన వర్ణనలు, వివరాలు ఆ గాథలలో దొరుకుతాయి. ఒక చక్రవర్తి కొలువు వైభవపు వర్ణనగాని, మత సంబంధమైన కార్యకలాపాల వర్ణనగాని, కొలువులలో జరిగే చిన్న కుతంత్రాల వివరాలుగాని చదువుతూ ఉంటే ఆ కాలపు ఉన్నత మర్యాదలు, నర్తకులు, వైభవము, హృదయం లేని హత్యాకాండలు, క్రూరమైన న్యాయ పరిపాలన ఇవన్నీ కళ్ళకు కట్టినట్లుండే మరో ప్రపంచంలోకి రవాణా అయి పోతాము. అంతేకాక, ఆనాటి ఆర్థిక రాజకీయ సాంఘిక పరిస్థితులు తెలిసికోడానికి వీలవుతుంది.

వేరు వేరు కాలాలలో భారతదేశానికి వచ్చిన నలుగురు విదేశ యాత్రికుల వ్రాతలను గురించి ఈ పుస్తకంలో తెలుసుకుంటారు. వారి వారి యాత్రలకు కారణములేవో, అప్పటి పరిస్థితులేవో తెలుసుకుంటే, వారి వారి వ్రాతలలోని అభి ప్రాయాలకు కారణాలు తెలుస్తాయి. అందుకనే, మెగస్తనీస్, అల్ బెరూని ఇద్దరూ వారి వారి రాజ్యాల ఆస్థాన విద్వాంసులు కనుక, వారి వ్రాతలలో ఆర్థిక సాంఘిక విషయాలను గురించి ఎక్కువగా నొక్కి చెప్పారు; ఫాహియాన్, హ్యూయెన్

త్సాంగ్, ఇద్దరూ చైనాదేశపు బౌద్ధ సన్యాసులు కనుక వారి వ్రాతలలో మత విషయాలు ఎక్కువ.

భారత దేశం దర్శించిన విదేశ యాత్రికులలో ముఖ్యమైన మొదటివాడు మెగస్తనీస్. ఇక్కడ కొన్ని సంవత్సరాలు నివసించి, మనదేశం గురించీ, ప్రజలను గురించీ, చాలా విషయాలు 'ఇండికా' అనే గ్రంథంలో వ్రాశాడు. అయితే అతని తరువాతి రచయితలు వ్రాసిన పుస్తకాలలో వారు 'ఇండికా' నుంచి ఎత్తి వ్రాసిన వ్రాతల ద్వారానే ఆ పుస్తకంలో ఏ విషయాలు ఉన్నాయో తెలుస్తుంది. అలా విడిగా దొరికే వ్రాతలు అన్నీ ఒకచోట చేర్చినా ఆ కాలపు చరిత్ర పూర్తిగా తెలిసుకోడానికి వీలుపడదు కాని, కొంచెం ఇంచుమించుగా ఆనాటి వాస్తవ పరిస్థితుల దృశ్యాన్ని ఊహించుకోవచ్చు.

మెగస్తనీస్ మనదేశం ఎందుకు వచ్చాడు ?

2400 సంవత్సరాల క్రితం మనదేశం పైకి దండెత్తి వచ్చిన అలెగ్జాండర్ మనదేశం విడిచి వెళ్ళిపోయాక, అతని సైన్యాధిపతులలో ఒకడయిన సెల్యూకస్ నికెటార్ అలెగ్జాండర్ జయించిన భారతీయ రాజ్యాలకు పరిపాలకుడయాడు. అలెగ్జాండర్ జయించిన కొన్ని రాజ్యాలు చంద్రగుప్తమౌర్యుడి నాయకత్వమునకు లొంగిపోయాయి. సెల్యూకస్ వాటిని తిరిగి వశపరచుకోడానికి ప్రయత్నించాడు. క్రీ. పూ. 305 వ సంవత్సరంలో చంద్రగుప్తుడు సెల్యూకస్‌ను ఓడించి, అతనితో చేసుకున్న ఒడంబడిక ప్రకారం సెల్యూకస్ తన కుమార్తెను చంద్రగుప్తుడికిచ్చి పెండ్లిచేసి, అతని ఆస్థానానికి మెగస్తనీస్ అనే గ్రీసు దేశపు రచయితను రాయబారిగా పంపాడు.

మెగస్తనీస్ మౌర్యచక్రవర్తుల రాజధానియైన పాటలీపుత్రంలో (ఇప్పటి పాట్నాకు దగ్గర) చక్రవర్తి సాదరంగా ఏర్పాటు చేయించిన బసలో నివసిస్తూ, దేశం అంతటా సంచారం చేస్తుండేవాడు. భారతదేశపు ఆకార పరిమాణాలను గురించి అతడు వ్రాసినది దాదాపు సరిగా ఉన్నది. మన గంగా, సింధూ, రెండు పెద్ద నదులను అతడు దర్శించి వర్ణించాడు. ఈ రెండు నదులూ వాటి



మెగస్తనీసు వర్ణించిన పెద్ద మఱ్ఱిచెట్టు

ఉపనదులతో సహా వర్షాకాలంలో వరదలు వచ్చినప్పుడు తప్ప, మిగిలిన కాలాలలో నౌకాయానానికి అనుకూలంగా ఉండేవి. ఈనాటి కంటే ఆనాడు నీటిదారులనే ఎక్కువ వినియోగించే వారట. రహదారులు కూడా ఉండేవి— వాటిలో ప్రసిద్ధమైనది ఈశాన్యదిక్కు నుండి పాటలీపుత్రం పోయేదారి. ఇరు

పక్కలా నీడనిచ్చే చెట్లతో, బాటసారులకు దారి నిర్దేశించే సూచన ఫలకాలతో, విశ్రాంతి గృహాలతో, దారిప్రక్క మంచినీటి బావులతో ఈ దారి ఈనాటి గ్రాండ్ ట్రంక్ రోడ్డుకు మార్గదర్శి అని చెప్పవచ్చు.

మనదేశంలో ఆనాడు పెరుగుతూ ఉండిన వివిధ వృక్షాలు అతనిని ఆకర్షించాయి. కొమ్మలతో కిందికి వేళ్లు పోసుకునేదాకా పెరిగే ఊడలతో ఉండే మర్రిచెట్టు అతనికి బాగా నచ్చింది. దాన్ని గురించి వ్రాస్తూ, 'ఒక్కొక్క చెట్టు మాను కైవారం ఎంత పెద్దది అంటే, అయిదుగురు మనుష్యులు కలిసి బారలు చాచినా దానిని కౌగలించుకోడానికి చాలరు' అన్నాడు మెగస్తనీస్. అతను వర్ణించిన ఒకానొక పెద్ద మర్రిచెట్టు నీడ ఎండవేళ 400 గుర్రపు రౌతులు విశ్రాంతి తీసుకోడానికి చాలినంత విశాలంగా ఉన్నదట.

భారతదేశంలోని శీతోష్ణస్థితి చక్కగా ఉంటుందని వ్రాశాడు. ఇక్కడి సారవంతమైన పొలాలలో సాలుకి రెండు పంటలు పండుతాయనీ, చలికాలం గోధుమ, బార్లీ, అపరాలు, వర్షాకాలంలో జనుము, జొన్న, వరి పండుతాయనీ వివరించాడు. ఇక్కడ తయారయే దినుసుల్లో రెండు అతనికి ఆశ్చర్యం కలిగించాయి. తేనెటీగలు లేకుండానే తయారయే తేనె వాటిలో ఒకటి. అది బహుశా చెరకుగడల నుంచి తయారయే బెల్లం అయిఉండాలి. మొక్కల పైని ఉత్పత్తి అయే వస్త్రాళ్ళకు పనికివచ్చే దూది కూడా అతనికి అచ్చెరువు కలిగించింది. భారత దేశంలో బంగారు గనులూ ముత్యాలు పోగుచేసే రేవులూ ఉన్నాయని కూడా అతను వ్రాశాడు. పడమటి దేశాలలో ముత్యాలకు ఎక్కువ గిరాకీ ఉన్నదనీ, ఒక తులం ముత్యాల విలువ మూడు తులాల బంగారపు విలువకు సమానంగా అక్కడివారు భావిస్తారనీ వ్రాశాడు.

ఇక్కడి పశుపక్షులను గురించి అతను వ్రాసిన విషయాలు కుతూహలం రేకెత్తిస్తాయి. తూర్పు భారతంలో ఉందని అతడు వర్ణించిన బలమైన శక్తి వంతమైన పులి బహుశా వంగదేశపు వ్యాఘ్రరాజానికి తాత అయి ఉంటుంది. అతడు వర్ణించిన కోతుల వంగడాలలో నల్లని ముఖమూ పొడవైన తోకా కలిగిన



కళ్లకు గంతలతో గుఱ్ఱాలను మచ్చిక చేయడం

లాంగూర్, పక్షి జాతులలో మాటలు నేర్చిన చిలకలూ చెప్పతగ్గవి. రథాలకు పూన్చే గుర్రాలకు ఆనాడు కూడా ఇప్పటివలెనే కళ్లకి గంతలుకట్టి, గుండ్రని మైదానంలో తిప్పించి తర్ఫీదు ఇచ్చేవారు.

భారతదేశంలో అడవి యేనుగులకు కొదవ లేదు. వీటిని చెరపట్టి యుద్ధంలో పాల్గొనేలాగ శిక్షణ ఇచ్చేవారు. ఈ యేనుగులను చెరపట్టే వింతయైన పద్ధతిని విపులంగా వివరించాడు. విశాలమైన చదును బైలు చుట్టూరా లోతయిన కందకం త్రవ్వి, ఆ కందకానికి అడ్డంగా కట్టిన వంతెన ఒకటే త్రోవ, దానిని



ప్రాచీన కాలంలో భారతీయుల దుస్తులు

మట్టితో వట్టిగడ్డితో కప్పి, లోపలి బోనులో మచ్చిక చేసిన ఏనుగులను ఉంచేవారు.

వాటి అరవులకి వశం తప్పి, రాత్రివేళ ఒక అడవి ఏనుగుల మంద ఆ కందకంలో ఏర్పాటు చేసిన బోనులో చిక్కుకుంటుంది. ఇది జరగగానే కందకం చుట్టూ కట్టుకున్న గుడెసెలలో పొంచిఉన్న వేటగాళ్లు బయటపడతారు. వాళ్లు కందకం మీది వంతెనను కూలద్రోసి, సహాయం కోసం కేకలు పెడతారు. అప్పుడు ప్రక్కనుండే గ్రామస్థులు మచ్చికయిన ఏనుగులెక్కి వస్తారు. అలా పట్టుపడిన అడవి ఏనుగులను మొదట ఆకలి దప్పులతో చిక్కిపోయేటట్లు చేస్తారు. వాటిలో ఇంకా కొంత పోట్లాడే సత్తువ మిగిలివుంటే, బాగా తిండిపెట్టి మచ్చిక చేసిన ఏనుగులతో వాటికి పోట్లాట పెడతారు. ఒక అడివి ఏనుగు నేలమీద వాలిపోగానే వేటగాళ్లు దాని మెడకు ఒక ఉచ్చు వేస్తారు. అది ఏనుగు మెడ చుట్టూ

లోతుగా తోసిన నాటులో సరిగ్గా సరిపోతుంది. అప్పుడు వేటగాళ్లు వాటి పైని ఎక్కి పల్లెకు తీసుకుపోతారు. మెడమీది గాయపు బాధవల్ల ఏనుగులు పైని సవారిచేసే మావటీలకు ఏ మాత్రము కుదుపు లేకుండా వెడతాయి.

మెగస్తనీస్ భారతీయులను గురించి, వారు పొడవుగా, సన్నంగా ఉంటారని వ్రాశాడు. వారు సాధారణంగా తమ నల్లని శరీరంపై నప్పేటట్లు పత్తి నూలుతో నేసిన తెల్లని బట్టలు ధరించేవారు. శరీరపు దిగువ భాగాన పంచెవంటిది కట్టేవారు. పై బట్ట బుజంపైని వల్లెవాటుగా ధరించేవారు. అది ఒకప్పుడు నెత్తిని కప్పేది.

భాగ్యవంతులు మాత్రం రంగు రంగుల ఉన్నిబట్టలు వేసుకొనేవారు. వారు తమ గడ్డాలకు, తెలుపు, నీలం, జేగురు, ఆకుపచ్చ రంగులు వేసుకొనేవారు. దంతంతో చేసిన చెవుల పోగులు, విలువైన రత్నాలు పొదిగిన బంగారు నగలు ధరించేవారు. వారికి పుష్పాలతో అలంకరించుకోడం ఇష్టం. ఇంకా దళసరి అడుగట్టగల తెల్లని తోలు చెప్పులు ధరించే వారనీ, ఎండదెబ్బకి రక్షణగా గొడుగులు వేసుకొనేవారనీ వ్రాశాడు.

ఆ కాలపు భారతీయులు సాధారణంగా ఆరోగ్యంగా వుంటూ చాలాకాలం 'దీర్ఘాయుర్దాయం' తో జీవించేవారు. వారి తిండి అలవాటులు, నిరాడంబరమైనవి. యజ్ఞాలలో పుచ్చుకొనే బియ్యంతో చేసిన పానీయం తప్ప మత్తు పానీయాలను వేటినీ త్రాగేవారు కాదు. వారు చాలకాలం జీవించడానికి ఇవే కారణం. జబ్బుగాఉన్నా, ఏ తొందర కలిగినా, యోగులను, బ్రాహ్మణ గురువులను సలహా అడిగేవారు. ఈ యోగులు, లేక వానప్రస్థులు అడవులలో నివసించేవారు. నారబట్టలు కట్టి, అడవిలోని పళ్లు తినేవారు. రోగాలు తగ్గడానికి రోగులను చెట్ల వేళ్లూ, పువ్వులూ తినమనీ రకరకాల దేహ పరిశ్రమ చెయ్యమనీ చెప్పేవారు. భారతీయ స్త్రీలు శీలవతులనీ, వరుడు డబ్బు ఉన్నవాడయితే ఇద్దరు ముగ్గురు భార్యలు కలవాడైనా సహించేవారనీ మెగస్తనీస్ వ్రాశాడు.

మన దేశంలోని కులాలూ తెగలూ అతనిని తప్పకుండా కలవర పెట్టి ఉంటాయి. ఇక్కడి ప్రజలను వారి వృత్తులను బట్టి ఏడు తరగతులుగా విభజించ

వచ్చు. వారు జ్ఞానులూ, రైతులూ, పశుపాలకులూ, చేతి పనులవారు, వర్తకులూ, సైనికులూ, వాస్తుశాస్త్రజ్ఞులూ (ఓవర్‌సీర్లు), గూఢచారులూ, స్థానికపాలనా సభ్యులు, న్యాయవిచారకులూ అని వ్రాశాడు. తన కులాన్ని దాటి పైకులంవారిని ఎవరూ పెళ్ళి చేసుకోకూడదు. వృత్తికాని, వర్తకంకాని మార్చుకోకూడదు. ఒక వ్యాపారం కంటె ఎక్కువ చేపట్టకూడదు. వారికి ఇలాటి నియమాలున్నాయని వ్రాశాడు. అంతే కాకుండా వేర్వేరు కులాలవారికి పంక్తి భోజనాలు లేవని కూడా వ్రాశాడు.

మెగస్తనీస్ భారతీయుల శీలమును మొగమాట పడకుండా మెచ్చుకొన్నాడు. వారు క్రమ పద్ధతిలో జీవించే ప్రజలనీ, అనవసరమైన అల్లరులను సహించరనీ వ్రాశాడు. వారి ఇళ్ళకు తాళం వేసుకునే అవసరం కనపడ లేదంటే వారెంతటి నీతిమంతులో తెలుస్తుందన్నాడు. దొంగతనాలు లేవు. భారతీయుల న్యాయ శాస్త్రం ముందుగా వ్రాసి ఉంచినది కాదు. ఆచారాలనూ, సంప్రదాయాలనూ అనుసరించి తమ వ్యవహారాలను చక్కదిద్దుకొనేవారు. వారి వ్యవహారపు ఒడం బడికలలో మనిషి మాటపై నమ్మకమే గాని, లిఖిత పూర్వకంగా చేసిన ఒప్పం దాలకూ, న్యాయశాస్త్ర నియమాలకూ అవసరం ఉండేవి కాదు. పుణ్యానికీ నీతికీ ఎక్కువ విలువ పాటించేవారు. సత్యం అంటే గొప్ప గురి ఉండేవి; అబద్ధపు సాక్ష్యాలు ఇచ్చిన వారి కాలు చేతులు తెగనరికే వారు. తమలో జ్ఞానులైన వారి యెడల బాగా గౌరవం చూపేవారు. మహా పురుషుల జీవిత గాథలను గానం చేస్తూ వారు చూపిన ఆదర్శ మార్గమునే అనుసరించేవారు.

మౌర్యుల రాజధానియైన పాటలీపుత్ర వైభవంలో సాటిలేని నగరం. అది గంగానది ఒడ్డున తొమ్మిది మైళ్ళ పొడవూ, ఒకటిన్నర మైళ్ళ వెడల్పుతో వ్యాపించి ఉండేది. కలపతో కట్టిన నగరపు ప్రాకారపు గోడ పొడుగునా అరవై నాలుగు కందపు వంతెనలూ, అయిదు వందల డెబ్బయి బురుజులూ ఉండేవి. గోడచుట్టూ లోతైన కందకం (అగడ్త) శత్రువులు లోపలకు రావడానికి అటంకంగా ఉండేది. కలపతో కట్టిన రెండూ లేక మూడంస్థుల మేడలకు అగ్నిప్రమాదాలు రాకుండా బాగా సురక్షితమైన ఏర్పాట్లు చేసేవారు.



నగరం మధ్య భాగంలో రాజుగారి కోటా, కోటకు చుట్టూ ప్రాకారపు గోడ వుండేవి. లోపలివైపు ఉద్యానవనమూ, జలక్రీడల కోనేరులూ, చేపల చెరువులూ, వింత గొలిపే రంగు రంగుల పక్షులూ ఉండేవి. రాజుగారి కోట కలపతో కట్టినదయినా బంగారు వెండి మలామాల శ్రమపడి చేసినతో అలంకరణతో అందంగా ఉండేది.

రాజు బంగారుజరీ అంచులతో నేసిన సన్నని వలిపాలు (మజ్లిను) కట్టుకొని, బంగారు పల్లకిలో ఊరేగేవాడు. జనం సాధారణంగా గుర్రపుస్వారీ చేసేవారు. బాగా ధనవంతులు ఒంటెలపై స్వారీ చేసేవారు. గాడిదపై స్వారీ చెయ్యడం అంటే


అప్పడాల కర్రవంటి
వాటితో శరీర మర్దన

చాలా కనిష్ఠంగా అగౌరవంగా భావించేవారు. భాగ్యవంతులు ఏనుగుల పైనీ, అప్పుడప్పుడు రథాలపైనీ ప్రయాణించేవారు.

జూదమూ, ఎద్దుల పరుగు పందెములూ, పొట్టేళ్ల పోట్లాటలు, కుస్తీలూ, ముష్టి యుద్ధాలూ వారి ముఖ్యమైన వేడుకలు. సామాన్య జనం సుఖంగా ఉండేవారు. భాగ్యవంతులు సౌకర్యాలతో భోగాలలో తూగేవారు. వారు అప్పడాల కర్రల వంటి వాటితో తమ ఒళ్లు మర్దనా చేయించుకొనే వారని వ్రాశాడు మెగస్తనీస్.

సర్వాధికారాలూ, సకల భాగ్యాలూ తనకు సంక్రమించి ఉన్నప్పటికీ, రాజు నిత్యమూ ఎప్పుడు ఏ గూఢశత్రువు తన్ను చంపివేస్తాడో అనే భయంతో ఉండే వాడు. తన రక్షణకై ఖండితమైన జాగ్రత్త తీసుకొనేవాడు. రాజు తినవలసిన ఆహారం అతని ఎదుట ఇతరులు రుచిచూసి తీరాలి; అతడు వరుసగా రెండు రాత్రులు ఒకే గదిలో నిద్రించేవాడు కాదు. అతనికి పగలూ రాత్రీ విరామం లేకుండా ఆయుధ పాణులైన స్త్రీలు కాపలా కాసే వారు. ఆయన వేటకి వెడితే, తాను వెళ్ళే దారి పొడుగునా పగ్గాలతో దడి కట్టేవారు. ఆ దడి దాటినవారికి మరణ దండన విధించేవారు. నగరంలోని రహస్యాలను కనుక్కొని రాజుకు నివేదించడానికి, గూఢచారి దళం ఉండేది. ఆ దళం ఎంత రహస్య ప్రదేశాని కైనా వెళ్లేది.

చంద్రగుప్తుడు తన సామ్రాజ్యపు రక్షణకోసం 7 లక్షల మంది నిలకడైన సైన్యాన్ని పోషించాడు. ముప్పదిమంది సేనానుల కూటం సైనిక వ్యవహారాలను చక్కబెట్టేది. ఈ కూటం ఆరు శాఖలుగా పనిచేసేది. (1) సైన్యాధిపత్యము (2) రాకపోకల సౌకర్యాలు, వస్తుసరఫరాలు, శ్రామికుల ఏర్పాటులు, (3) సైని కులు, (4) అశ్వసైన్యం, (5) ఎద్దులులాగే రథాలపటాలం, (6) ఏనుగుల దండు.

ఆ రోజులలో యుద్ధ పద్ధతులు మోటుగా వుండేవి. రైతులు తమ పొలం పనులు చూసుకొంటూనే ఉండేవారు; దేశం అంతా యుద్ధంలో పాల్గొన్నది అనడానికి వీలులేదు. యుద్ధంలో ఎదుర్కొన్న ఇరు పక్షాల గెలుపు ఓటములు దొమ్మియుద్ధాల ద్వారానే తేలిపోయేవి; ఏనుగుల దండుకే చాలా ప్రాముఖ్యం

ఉండేది. సిపాయిలు నిలువెత్తు విల్లూ, మూడు గజాల పొడవు అమ్ములూ గల బాణాలు వాడేవారు. వీరు శత్రువులపైని ఆపకుండా బాణాలు వదిలేవారు-గురి తప్పకుండా కొట్టే శక్తి వారికి ఉండేది. "భారతీయ సైనికుని బాణ వేగానికి ఆగగల శక్తి దేనికీ లేదు. అది డాలు కానీ, కవచం కానీ, మరేగట్టి రక్షణోపాయమైనా ఆ బాణానికి తూట్లు పడవలసిందే" అని వ్రాశాడు మెగస్తనీస్. ఎదురెదురు పోరాటంలో వదును చెయ్యని ఎద్దు చర్మంతో చేసిన సన్నని పొడుగైన డాలు ఎడమచేతిలో ధరించేవారు. కొందరు బాణాలకు బదులు చిన్న ఈటెలు వాడే వారు; కాని వెడల్పయిన వాదర గల మూడు మూరల పొడవైన కత్తి ప్రతి యోధుడూ రెండు చేతులతో కూడా ప్రయోగించగలిగి ఉండేవాడు.

గుర్రపు రౌతులు జీను లేకుండానే సవారి చెయ్యగలిగేవారు; రెండు పెద్ద బల్లెములూ, ఒక చిన్న యీటే తీసుకువెళ్ళేవారు. గుర్రం నోటికి కళ్ళెమూ, ఇనప ముక్కల బదులు గుచ్చుకునే ముళ్ళతో గుండ్రని చిక్కం గుర్రం మూతికి కట్టేవారు. ఆ చిక్కం ఎద్దు చర్మంతో చేసింది. అది కలిగించే నొప్పివల్ల గుర్రం చెప్పినట్లల్లా నడుచుకొనేది.

యుద్ధంలో వినియోగించే జంతువులూ ఆయుధాలూ కూడా రాజుగారి ఆస్తి గనుక, అవసరం లేనప్పుడు వాటిని రాజుగారి జంతుశాలలోనికి ఆయుధాగారాలకీ అప్పచెప్పేవారు. దేశం లోపల తిరుగుబాటులు గాని, బైటినుంచి దండయాత్రలు గాని జరిగే భయం ఎల్లప్పుడూ ఉండేది. అందుకని చక్రవర్తి తన సామ్రాజ్యం అంతటినీ రక్షించుకోడానికి బలమైన పెద్ద సైన్యాన్ని పోషించేవాడు.

సైన్యాధికారులేకాక, దేశం అంతటా పరిపాలన సాగిస్తూ విపణి వ్యాపారం చూసుకునే అధికారులు కూడా ఉండేవారు. వీరు పన్నులను నిర్ణయించడం కోసమూ, వారసత్వ నిర్ణయం కోసమూ భూములను కొలిపించేవారు; నదులపై రాకపోకలను సానుకూలం చేసేవారు. గనుల కార్మికుల పనినీ, చేతివృత్తుల వారి పనినీ అజమాయిషీ చేసేవారు. రహదారులను వేయించి ప్రతి మూడవ, నాలుగవ మైలుకీ స్తంభాలు పాతించేవారు. వాటిపైని దూరమూ, దిక్కులూ వివరించే సూచనలు వ్రాయించేవారు; పన్నులు వసూలుచేసేవారు. కూటమునకు



బంగారం తవ్వే చీమలు



పెద్ద రెక్కల తేలు

ఐదుగురు సభ్యులచొప్పున ఆరు అధికారుల కూటాలు పాటలీపుత్రనగర పరిపాలన సాగించేవారు. పుట్టుకలను, చావులను ఎప్పటికప్పుడు ఒక చిట్టాలో ఎక్కించి, జనాభా లెఖ్ఖలను జాగ్రత్త పెట్టేవారు. కళలను, చేతిపనులను తరచు తణిఖీచేసి ప్రోత్సహించేవారు. బరువులూ, కొలతలూ, సరిగా నిర్ణయించి ప్రకటించి, బజారులో అమ్మకాలు న్యాయంగా జరిగేటట్లు చూసేవారు. ప్రభుత్వానికి చేరవలసిన పన్నులన్నీ అప్పటికప్పుడు వసూలు చేసేవారు.

ఆనాడు భారతదేశం అద్భుతాలకు నిగూఢ రహస్యాలకు ఆటపట్టనే అభిప్రాయం విదేశాలలో చలామణి అవుతూండేది. మెగస్తనీసుది ఈ కట్టుకథలను సులువుగా నమ్మే స్వభావం. ఏమాత్రమూ హాస్యమూ, వెటకారమూ లేకుండా



మెగస్తనీసు వర్ణించిన వింత కుక్క

తాను విన్న అసందర్భమైన కట్టుకథలను తన రచనలో చేర్చాడు. ఇండియాలో అపురూపమైన వింత జంతువులుండేవట. సింధునది దిగువ మైదానంలో దర్దే అను ప్రజలు నివసించే చోట బంగారం తవ్వి తీసే చీమలుండేవట. నక్కంత ఒడ్డూ పొడవూ ఉండే చీమలు బొరియలు తవ్వి తమకు తెలియకుండా ఎన్నో మణుగుల బంగారపు ఇసుకను పైకి తీసుకు వచ్చాయట. ప్రక్కను పొంచి ఉన్న జనం సడీ చప్పుడూ లేకుండా వచ్చి, చీమలకు మాంసపు ముక్కలు ఎరవేసి వాటి దృష్టిని మళ్లించేవారు. బంగారు ఇసుక పోగుచేసుకొని తీసుకొని పోయేవారట.

పెద్ద చెవులతో నుదుటి కంటితో దయ్యపు మనిషి



సాధారణంగా వారు చీమల దృష్టిలో పడకుండానే బంగారు ఇసుక ఏరుకొనే వారు కాని, ఒక్కొక్కసారి, చీమలకు కనబడిపోయేసరికి, ఆ చీమలు వారిని తరిమి తరిమి వారినీ వారు ఎక్కివచ్చిన జంతువులనూ కూడా పట్టుకొని, కుట్టి చంపి వేసేవట. గబ్బిలపు రెక్కలలాటి రెక్కలతో ఎగిరే రెండు మూరల పొడవయిన పాములూ, రెక్కలుగల తేళ్లూ, తమ గ్రుడ్లు ఊడివచ్చేటంత తీవ్రంగా కరిచే కుక్కలూ మన దేశంలో ఉండేవని కూడా వ్రాశాడు మెగస్తనీస్.

పిట్ట కథలలోని జంతువులను గురించి వ్రాసి ఊరుకోక, అతడు ముక్కు పుటాలు లేకుండా తొమ్మిది అడుగుల పొడవుండే రాక్షసులను గురించీ, పడుకునే

ఒక శాసనము



టప్పుడు పాదాలదాకా అంటుకునేటంత పొడవైన చెవులు గల ప్రజలను గురించీ, డెక్కలుగల పాదాల మనుష్యులను గురించీ, కుక్కచెవుల మనుష్యులనూ నుదుటిపై గల ఒంటికంటి రాక్షసులనూ గురించీ కూడా వ్రాశాడు.

మొత్తానికి, మెగస్తనీస్ వ్రాతల సారాంశం ఏమిటంటే – మౌర్య సామ్రాజ్యంలో అధికారవర్గం ఎంతో చక్కగా పరిపాలించేవారు. రాజ్యం అంతటా ఆర్థిక జీవితాన్ని ఎన్నో రీతుల కొనసాగి సమర్థంగా నడిచేది. క్రమం తప్పక పన్ను వసూళ్లు చేస్తూ భూమి కొలతలూ పంటల వివరాల మతలబుల్లూ అన్నీ చాకచక్యంతో జాగ్రత్త పెట్టేవారు అధికారులు. దేశంలో భద్రతా, న్యాయ పరిపాలనా ఆనాడు ఏ చిక్కులూ లేకుండా కొనసాగేవి. ప్రజలు నీతిమంతులుగా ఉండేవారు; దొంగతనాలు అరుదు; దౌర్జన్యం కూడని పని. న్యాయపరిపాలన సమర్థవంతంగా సాగేది; సాధారణంగా చక్రవర్తియే బహిరంగ విచారణలో అధ్యక్షత వహించేవాడు. సామాన్య ప్రజలు సుఖంగా ఉండేవారు; వారు రాజా స్థానాలలోని రాజకీయాలతోను కుట్రలతోను జోక్యం కలిగించుకొనేవారు కారు.

**మౌర్యుల కాలం నాటి నాణెములు**



# ఫాహియాన్ నాటి భారతదేశం

మెగస్తనీస్ వచ్చిన 700 సంవత్సరాలకు, చైనా నుంచి ఫాహియాన్ అనే బౌద్ధ సన్యాసి భారతదేశానికి వచ్చాడు. 'బౌద్ధరాజ్యాల చరిత్ర' అని అతడు వ్రాసిన గ్రంథంలో, 1500 సంవత్సరాల క్రితపు భారతదేశం గురించి ఎన్నో విషయాలు తెలుస్తాయి.

మన దేశానికి వచ్చిన యీ మొట్టమొదటి ప్రసిద్ధ చైనాయాత్రికుని కథ చాలా కుతూహలాన్ని రేకెత్తిస్తుంది. ఫాహియాన్ తల్లిదండ్రులు బౌద్ధశ్రమణుడు (సన్యాసి) గా పెరిగి పెద్దవాడు కావలెననీ, బాల్యంలోనే అతన్ని బౌద్ధ మఠానికి శిక్షణకోసం పంపారు. అతడు పదేళ్లవాడుగా ఉన్నప్పుడే తల్లిదండ్రులను కోలు పోయాడు, కాని, బౌద్ధ ధర్మసాధన మాత్రం వదిలిపెట్టలేదు. ఒకనాడు తన తోటి పిల్లలతో వరిచేనులో పని చేస్తుండగా, దోపిడీదారులు వచ్చి అటకా యించారు. చిన్న పిల్లలు భయపడి, పారిపోయారు. ఫాహియాన్ మాత్రం అక్కడ ధైర్యంగా నిలబడ్డాడు. అతడు వారితో మంచీ, చెడ్డా, మాటాడి, పూర్వ జన్మలలో చేసిన చెడు కర్మలు కారణంగా ఈ జన్మలో వారు దోపిడి దొంగలయినారని చెప్పాడు. ఇంకా అలాగే చెడు త్రోవలలో పోతూఉంటే వారి భవిష్యత్తు ఇంకా అయోమయంగానే ఉండిపోతుంది. ఫాహియాన్ మాటలు నచ్చి, దొంగలు ధాన్యం వదిలేసి వెళ్లిపోయారు.

తన 20 వ ఏటనే ఫాహియాన్ పరిపూర్ణ బౌద్ధ సన్యాసి అయి, ఆ తరువాత క్రీ. పూ. 399 లో భారతదేశ యాత్ర చేయనిశ్చయించుకొన్నాడు. అతడు ఇల్లు విడిచి, గడపిన 14 ఏళ్లలోను, ఆరేళ్లు ప్రయాణాలలోను, ఆరేళ్లు భారతదేశం


Woo-ee
Hoang-ho
Cheng Yih
Khoten
Skardo
Nagara
Hidda
Safid Koh
Peshawur
Mutt ra
Sravasti
Kapila Vastu
Vaisali
Patna
Benares
Gaya
Tam-look
Brahmaputra R
Lan Chow
Lung
Tsing Chow
Nanking
Yang-tsze-Kiang
T I B E T
C H I N A
I N D I A
BURMAH
SIAM
BAY OF BENGAL
CEYLON
SUMATRA
BORNEO
JAVA

లోను, రెండేళ్లు సింహళంలోను గడిపాడు. వేలకొద్దీ మైళ్ళ పర్వతమయమైన భూమార్గం ద్వారాను, దీర్ఘమైన సముద్ర మార్గం ద్వారాను అతను యాత్ర పూర్తిచేశాడు. బౌద్ధమతావలంబిగా పవిత్రమైన బౌద్ధ క్షేత్రాలను దర్శించి, బౌద్ధ గ్రంథాలను, బుద్ధుని జీవితకాలపు అవశేషాలను సంగ్రహించడం అతని యాత్రకు ముఖ్యోద్దేశం. చైనాలో బౌద్ధమతం అవలంబించాక, మఠాలు నిర్మించడమూ, పవిత్ర గ్రంథాలను చైనా భాషలోకి అనువదించడం జరిగింది. అయితే చైనా బౌద్ధ సన్యాసులకు తాము అనుసరించవలసిన మత సూత్రాలు, ఆశ్రమ ధర్మాలు ఏవో స్పష్టంగా తెలియదు. బుద్ధుడు బోధించిన ధర్మసూత్రాలు సరియైన అర్థం ఏదో తెలిసికోవాలని ఉండేవి వారికి. ఆ కోరికతోనే చాలమంది బౌద్ధ సన్యాసులూ, విద్వాంసులూ భారతదేశం దర్శిస్తూ వచ్చారు.

మెగస్తనీస్ కాలానికి తరువాత మనదేశంలో జరిగిన చారిత్రక సంఘటనలేవేవో స్థూలంగా నెమరువేసుకొందాం. మౌర్య చక్రవర్తులకు తరువాతి కాలంలో కుషానులనే విదేశీయ జాతివారు వచ్చారు. కనిష్కుడనే చక్రవర్తి పాలనలో మధ్యాసియా నుంచి మధురవరకూ వారు విశాలమైన సామ్రాజ్యం స్థాపించారు. బౌద్ధమతం స్వీకరించి, కనిష్కుడు ఆ మతాన్ని తన సామ్రాజ్యంలోను, ఇంకా చైనా మొదలైన విదేశాలలోను వ్యాపింపజేశాడు. ఫాహియాన్ యాత్రకు బైలుదేరిన నాటికి కుషాన్ సామ్రాజ్యం నశించి (దాదాపు రెండు శతాబ్దాలు) కావచ్చింది కాని, బౌద్ధమతం వేరు నాటుకొన్న దేశాలలో మాత్రం బాగా స్థిరపడి ఉన్నది.

కనిష్కునికి 300 సంవత్సరాలు తరువాత కూడా ఖోటాన్ (ఇప్పటి సింకియాంగ్) లోను, ఆ చుట్టుపక్క దేశాలలోను బౌద్ధమతం బాగా వ్యాపించి స్థిరపడింది. ఆ ప్రాంతాలలోని మఠాలలో నియమబద్ధంగా జీవించే వేల కొద్దీ బౌద్ధ భిక్షువులను ఫాహియాన్ తన యాత్రలో దర్శించాడు. 80 ఏళ్ల పాటు నిర్మాణం కొనసాగిన ఒకానొక మఠం పూర్తి అయేసరికి ఆ రాజ్యంలో వరుసగా ముగ్గురు రాజుల పరిపాలన పూర్తి అయిందట. ఈ మఠంలోని బుద్ధ మందిరపు చావడి

విశాలమైనది. గోడలపై అందమైన చెక్కడాలతో, పెద్ద దూలాలతో, స్తంభాలతో, ద్వారాలతో, కిటికీలతో, అంతటా బంగారు ఆకుల అల్లికలతో దేదీప్యమానంగా ఉంటుంది. బౌద్ధ భిక్షువులు బసచేసే గదులలోని చెక్కడపు అల్లికలను వర్ణించడానికి ఫాహియానుకు మాటలు చాలలేదట.

ఘంట మ్రోగగానే మతాలలోని భిక్షువులు భోజనానికి హాజరయ్యేవారు. వంక్తిలో మౌనంగా కూర్చుని, వడ్డన చేసేవారికి చేతిలో సంజ్ఞలు చేసేవారు. మత సంబంధమైన ఊరేగింపులను గూర్చి ఫాహియాన్ చేసిన వర్ణనలలో మనకు బాగా పరిచయమైన దృశ్యాలే కనబడతాయి. ఉత్సవ సమయాలలో బుద్ధ విగ్రహాలను, హిందూ దైవాల మూర్తులను పట్టుగుడ్డల తోరణాలతోను మేలు

బౌద్ధ భిక్షువుల భోజన దృశ్యము





బుద్ధుని భిక్షా పాత్ర, చందనపు దంతము మున్నగు పరికరాలు

కట్లతోను అలంకరించిన రథాలపైని ఊరేగించేవారు. రాజు, రాణి, పువ్వులతో పూజించి, కర్పూర హారతిచ్చి, పేదలకు విరివిగా దానాలిచ్చేవారు.

ఫాహియాన్ భారతదేశం దర్శించినప్పుడు ఇక్కడ పరిపాలిస్తూ ఉండిన చక్రవర్తి చంద్రగుప్త విక్రమాదిత్యుడు, కాశ్మీరంలోని స్కర్డు అనేచోట ఐదేళ్లకొకసారి సమావేశమయ్యే పంచ పరిషత్తు అనే మహాసభను ఏర్పాటుచేశాడు. సభ సమాప్తమైనప్పుడు చక్రవర్తీ అతని మంత్రులూ బౌద్ధ భిక్షువులకు కానుకలను సమర్పించారు. ఇండియాలోని ఒక మఠంలో ఫాహియాన్ బుద్ధదేవుని దంతమూ, పీకదాను మొదలైన అవశేషాలను దర్శించాడు. అతడు గాంధారంలోని ఒక రాతిపైని బుద్ధుని పాద చిహ్నాలను చూశాడు. పురుషపురం (పెషావర్) లో కనిష్కుడు నిర్మించిన మహా స్థూపాన్ని, ఇంకొక దేదీప్యమానమైన స్థూపంతో

ఉంచిన బుద్ధుని భిక్షా పాత్ర, బుద్ధుని కపాలంలోని చదును ఎముక, ఆయన ఉపయోగించిన చందనపు కర్ర చూచాడు. ఈ వస్తువులన్నీ పూజకు ఉపయోగించే పవిత్ర అవశేషాలు. అన్నింటికంటె ఫాహియాన్‌కు బాగా నచ్చినది ఒక రాతి గుహలో దర్శించిన బుద్ధమూర్తి! అది బంగారు ఒడలి ఛాయతో సహజంగా కనబడేటట్లు చెక్కవుంది. బుద్ధుడు తన ఛాయను అక్కడ వదలి పెట్టి, భక్తులైన యాత్రికులకు మాత్రము అక్కడ సాక్షాత్కరిస్తూంటాడని బౌద్ధుల నమ్మకము.

మధురకు వెళ్లే త్రోవలో ఫాహియాన్ వేల కొలది బౌద్ధభిక్షువులు నివసించే మఠాలను చూశాడు. మత సహనము ప్రాచీన భారతదేశపు ముఖ్య సుగుణాలలో ఒకటి. ఫాహియాన్ చూచిన ప్రతి చోటా రాజులు కాని, భాగ్యవంతులయిన ప్రజలు కాని, వారు హిందూ మతస్థులయినా సరే బౌద్ధ భిక్షువులకూ మఠాలకూ ధనమూ, భూములనూ భక్తి శ్రద్ధలతో దానం చేసేవారు.

మధ్య దేశంలో బుద్ధుడు స్నానం చేసిన చోటనీ, తల నీలాలు కత్తిరించిన స్థలమనీ, గోళ్లు తీసిన చోటు అనీ ప్రసిద్ధిపొందిన అనేక పవిత్ర యాత్రాస్థలాలను అతను దర్శించాడు. బుద్ధుని గూర్చి తాను వ్రాసిన మహిమలన్నీ తప్పక జరిగినవే అని ఫాహియాన్ భక్తి పూర్వకంగా విశ్వసించాడు.

బౌద్ధమతంలోని వేరు వేరు శాఖలకు చెందిన భిక్షువులూ, భిక్కునీలూ కలిసి మెలిసి ఒకే మఠంలో ఎరమరిక లేకుండా నివసిస్తూ ఉండడం ఒక చెప్పుకోతగ్గ సుగుణం. అభిప్రాయాలు భేదించినా, తేడాలు పాటించకుండా అన్ని శాఖల సన్యాసులకు, దారిపోయే యాత్రికుల వారు సహనబుద్ధితో ఆతిథ్యం ఇచ్చేవారు.

బుద్ధునకు సమకాలికుడు కోసలదేశపురాజు ప్రసేనజిత్తు. అతను మొట్టమొదటగా పూజకోసరం చందనంతో బుద్ధ విగ్రహం చెక్కించాడని ఫాహియాన్ వ్రాశాడు. అంటే బుద్ధుని తరువాత ఎప్పటికో కాక, ఆయన కాలం లోనే ఒక మాదిరి విగ్రహారాధన ఆరంభించిందని చెప్పవచ్చు.

ఫాహియాన్ దర్శించిన కపిలవస్తు, శ్రావస్తి, రాజగృహ, గయ, వంటి పవిత్ర బౌద్ధ యాత్రా స్థలాలు అప్పటికప్పుడే నిర్జనమై పాడుపడిన స్థితికి దిగజారాయి. పాటలీపుత్రమును అతడు కుసుమపురం (పువ్వుల నగరం)గా వర్ణించాడు. ప్రసిద్ధ బౌద్ధమత పోషకుడయిన అశోకుడు 84,000 విహారాలను

నలందా



కట్టించి భిక్షుకుల నివాసానికి ఏర్పాట్లు చేశాడని కూడా వ్రాశాడు. రాజభవనపు వైభవానికి ఆశ్చర్యపడుతూ "నగరం మధ్యను రాజభవనమూ అందలి విశాలమైన గదులూ కట్టినప్పు డెలా ఉండేవో ఇప్పటికీ అలాగే ఉన్నాయి. పేర్చిన శిలలతో, పెంచిన గోడలతో, ద్వారాలతో, ఉదాత్తమైన శిల్పాలతో, చెక్కడపు నగిషీలతో, ఈ పని అంతా ప్రపంచంలోని ఏ మానవుడికీ సాధ్యం కాని రీతిని ఏ యక్షిణులో నిర్మించినట్లుగా ఈనాటికీ అనిపిస్తున్నవి" అని వర్ణించాడు. పాటలీపుత్రం వద్ద సింహలాంఛనంతో ఉన్న అశోక స్తంభాన్ని ఎంతగానో మెచ్చుకొన్నాడు.

ప్రాచీన భారతదేశపు శిల్పుల చాకచక్యానికి దృష్టాంతమైన పారావత మఠాన్ని గురించి ఫాహియాన్ దక్షిణానికి వెళ్లినప్పుడు తెలిసికొన్నాడు. పెద్ద కొండ రాయిని మలచగా ఏర్పడిన ఆ మఠంలో 5 అంతస్థులు ఉండేవి. ఏనుగు ఆకారంలో ఉండే దిగువ అంతస్థులో 500 గదులు, సింహం ఆకారంలో ఉండే రెండవ అంతస్థులో 400 గదులు, గుర్రపు ఆకారంలో ఉండే 3 వ అంతస్థులో 300 గదులు, ఎద్దు ఆకారంలో ఉండే 4 వ అంతస్తులో 200 గదులు, పావురం అకారంలో ఉండే 5 వ అంతస్తులో 100 గదులూ ఉన్నవట. శిఖరంమీది ఊట బావి నుండి అన్ని అంతస్థుల లోనికి నీటి సరఫరా ఉండేది. అన్ని గదులలోనికి వెలుగువచ్చే కిటికీలుండేవి. అతడు సంస్కృతం నేర్చుకొని, కొన్ని ముఖ్యమైన గ్రంథాలను సమకూర్చుకోగలిగాడు.

ఈనాటి ఉత్తర ప్రదేశ్ ఉండే ప్రాంతమును ఆనాడు మధ్య దేశము అనే వారు. ఆనాడు కూడ ఆ ప్రాంతంలో జనసంఖ్య క్రిక్కిరిసి ఉండేది. అక్కడి న్యాయ పరిపాలన విధానాన్ని ఫాహియాన్ ప్రత్యేకంగా మెచ్చుకున్నాడు. "అవయవాలు నరికేయడం వంటి కఠిన దండనలు లేకుండానే రాజు న్యాయపాలన చేసేవాడు. సందర్భమును బట్టి తేలికగా గాని లేదా బరువుగా గాని, నేరస్థులకు సామాన్య జరిమానా విధించేవారు. తిరిగి తిరిగి దౌర్జన్యంతో తిరుగుబాటు చేసే వారికి కుడిచేయి నరికేసేవారు. నేరం అతిగా లేకపోతే శిక్షలు తేలికగాను, ప్రభుత్వం కాస్త దయగాను వ్యవహరించడం జరిగేది.



పారావత మఠము

ఆర్థిక పరిస్థితులను గురించి ఫాహియాన్ ఏదో కొద్దిగానే సూచించినా, ఆ కొద్ది విషయాల ద్వారా మనకు ఎంతో తెలుస్తోంది. పదార్థాలను అమ్మడానికీ కొనడానికీ గవ్వలను ఉపయోగించేవారు." నాణెములు చలామణీలో ఉండేవి కాని, చాలా దినుసులు ఎంతో చవకగా ఉండడంచేత బేరాలు గవ్వలతో కూడా సాగిపోయేవి అని అనుకోవచ్చు. "రాజుగారి అంగరక్షకులకు ఇతర ఉద్యోగు లందరికీ జీతాలుండేవి." దీనిని బట్టి భూములను జాగీర్లుగా ఇయ్యడం అనాడు లేదనీ, అది తరువాత వచ్చిందనీ తెలుస్తుంది.

ఫాహియాన్ తరచు దేనినైనా మెచ్చుకొంటే ఆకాశాని కెత్తివేసే అతిశ యోక్తులు వ్రాసేవాడు; భారతదేశంలోని అహింసా వ్యాప్తిని గురించి వ్రాస్తూ "దేశం అంతటా ప్రజలు ఏ జీవజంతువునూ చంపరు; మత్తు పానీయాలు సేవించరు; నీరుల్లి కాని, వెల్లుల్లి కాని తినరు-" అన్నాడు. ఈ మాట దేశం లోని ప్రజలందరికీ వర్తించక పోవచ్చు. ముఖ్యంగా రాజులూ సామంతులూ మృగాలవేట వదలినట్లు కనబడదు. ఫాహియాన్ వ్రాసినట్లుగా, కసాయి దుకాణాలు, మత్తుపానీయాల అంగడులూ లేవు కాని, చండాలురూ, అస్పృశ్యులూ (అంటరానివారు), వేటాడడమూ, మాంసం అమ్మడమూ ఉండేది.

అంటరానితనం చాలా తీవ్రంగా పాటించేవారు. అంటరానివారిని సమా జంలో చాలా నీచంగా పరిగణించేవారు. వారి యిళ్లూ, పేటలూ పట్టణాలకు బయటి వెలివాడలలో ఉండేవి. "వాళ్లు నగర సింహద్వారం కాని, విపణి వీథి (బజారు)కాని ప్రవేశించే ముందు ఒక కర్రముక్కతో నేలమీద కొట్టి, తాము వస్తున్నట్లూ పై కులాలవారు తమని అంటకుండా దూరంగా ఉండమని హెచ్చ రించడం కద్దు" అని వ్రాశాడు ఫాహియాన్.

భారతదర్శనం పూర్తి అయాక, ఫాహియాన్ తామ్రలిప్తి (తామ్లుక్) రేవులో ఓడ యెక్కి 14 రోజులు ప్రయాణం చేసి సింహళం వెళ్ళాడు. అక్కడ రెండేళ్లు ఉండి, చైనాకు వెళ్లిపోయాడు. అతని తిరుగు ప్రయాణం గురించి విపులంగా ఫాహియాన్ చేసిన వర్ణనల ద్వారా, జీవితంలోని ఎటువంటి క్లిష్ట పరిస్థితులను ఏ విధంగా ధైర్య సాహసాలతో ఎదుర్కొన్నాడో తెలుస్తుంది!

"గాలి అనుకూలంగా ఉండినపుడు వారి ఓడ తూర్పు దిక్కుగా పదూడు రోజులు ప్రయాణం చేసిన తరువాత వారికి పెద్ద తుఫాను గాలి ఎదురయింది. ఓడలో చిల్లుపడి నీరు లోపలికి చేరుకుంది. వర్తకులు చిన్న పడవలోకి మారుదాం అనుకున్నారు; కాని, పడవపైనున్నవారు ఎక్కువమంది జనం వచ్చేస్తారేమో అని భయపడి, కలిపి కట్టిన పగ్గాన్ని తెగ కోశారు. ఉన్నపాటున చనిపోతా మేమో అని వర్తకులు బెంబేలు పడిపోయారు. బరువు తగ్గితే పడవ మునగ కుండా ఆగవచ్చని, బరువైన వస్తువులూ సామాన్లూ నీటిలోకి తోసివేశారు. ఫాహియాన్ కూడా, తన భిక్షాపాత్ర, మొగం కడుగుకొనే డేకిశా మరికొన్ని సామాన్లతో కలిపి సముద్రంలోకి విసిరేశాడు. సముద్రంమీద తిరుగుతూ ఈ చోటుకు దగ్గరగా సముద్రపు దొంగ లుండేవారు. వారు ఎదుటపడితే వెంటనే చావు మూడినదన్నమాటే! మహా సముద్రం అనంతంగా ఆకాశం అంచుదాకా వ్యాపించి ఉంది. తూర్పు ఏదో పడమర ఏదో తెలిసే సూచన లేదు. సూర్యునీ, చంద్రునీ, చుక్కలనూ గుర్తు పెట్టుకుంటూ ముందుకు సాగిపోవాలి. వాతావరణం చీకటిగా గాని, మబ్బుగా గాని ఉంటే పడవగాలి ఎలాతోస్తే అలా వెళ్ళవలసిందే- ఎటు వెళుతున్నామో తెలియకుండా! రాత్రి చీకటిలో ఒకదానిపై ఒకటిపడి విరుగుతూ ఘోష పెట్టే మహా తరంగాలు, నిప్పుల తళ తళ మెరుస్తూంటే వాటి మధ్యను పెద్ద పెద్ద తాబేళ్లూ భయంకరమైన ఇతర జలచరాలూ కనబడతాయి. ఎక్కడికి పోతున్నారో తెలియక వర్తకులు భయభ్రాంతులై పోయారు. సముద్రం అడుగు ఎక్కడుందో తెలియనంత లోతుగా ఉంది. లంగరు వెయ్యడానికి గాని, ఆపడానికి గాని ఎక్కడ వీలో పాలుపోదు. ఆకాశం మబ్బులు చెదరిపోయి స్వచ్ఛం కాగానే తూర్పూ పడమరా తెలిసి పడవ మళ్లీ సరియైన మార్గం పట్టింది.'' పడవ కాని నీళ్లల్లో కనబడని ఏ రాతినైనా ఢీ కొన్నదంటే తప్పించుకొనే మార్గం లేదు.

ఫాహియాన్ గ్రంథం ముఖ్యంగా బుద్ధుని జీవితానికి సంబంధించిన స్థలాలను గురించే వ్రాసినప్పటికీ అతడు 5 వ శతాబ్దపు భారత దేశంలోని వివిధ విషయాలను గురించి అమూల్యమైన చరిత్రాంశాలను అందజేశాడు. గుప్తచక్ర

వర్తుల సౌమ్య పరిపాలనలో దేశం శాంతితో సంపదతో వర్ధిల్లింది. నేరాలు లేవు. బయటి దేశాలలో బాగా పాదుకొని వున్నప్పటికీ బౌద్ధమతానికి అనాడు తాను పుట్టిన దేశంలో ప్రాముఖ్యమూ రాజాదరణా తగ్గిపోయాయి. హిందూ మతం క్రమంగా తిరిగి అభివృద్ధి మార్గం పట్టింది. ప్రజల జీవితాలలో మతానికి ప్రాముఖ్యం హెచ్చింది కాని, అది వారిలో కలహాలకు కారణం కావడంలేదు. పండుగ దినాలలో హిందూ దేవతలతో పాటు బుద్ధునికి కూడా సమాన పూజాస్థానం ఉండేది; మత సహనం అనాటి ప్రజల ముఖ్య సుగుణాలలో ఒకటి! దేశం అంతటా ప్రాచీన మతాలలో వేరు వేరు మతవిశ్వాసాలుగల సన్యాసులూ భిక్షువులూ కలిసి మెలిసి జీవించేవారు; ఎప్పటిలాగే నియమబద్ధమైన జీవితం గడిపేవారు. శాకాహారమునకు ప్రాధాన్యం ఇచ్చిన అహింసా సిద్ధాంతము బౌద్ధ మతానికీ హిందూ మతానికి కూడా అవలంబనీయం అయింది. అయితే, బుద్ధుడు నిరసించిన వర్ణాశ్రమ ధర్మం మాత్రం దేశంలో స్థిరపడిపోయింది.



# హ్యూయెన్‌త్సాంగ్ నాటి భారతదేశం

ఫాహియాన్‌కు రెండు వందల ఏళ్ల తరువాత ఇంకొక చైనా యాత్రికుడు భారతదేశం వచ్చాడు. అతని పేరు హ్యూయెన్‌త్సాంగ్. పన్నెండు భాగాలుగా అతడు 'యాత్రలు,' లేక, 'పశ్చిమ దేశాల గూర్చిన విలేఖనములు' అనే గ్రంథం వ్రాశాడు. అందులో భారత దేశంలో చేసిన దీర్ఘయాత్రలో కనుగొన్న విషయాలను వివరంగా వర్ణించాడు.

చైనాలో ఒక గౌరవనీయమైన ప్రాచీన కుటుంబంలోని పిల్లలందరిలో చిన్నవాడు అతను. అతని తెలివితేటలకు మురిసి, తండ్రి అతనిని 13 వ యేట ఒక మఠంలో చేర్చి అతని జ్యేష్ఠ సోదరుని అజమాయిషీలో చదువుకొనడానికి పంపాడు. సాధారణంగా ముందుగా చేసే పరీక్ష అక్కరలేకుండానే అతన్ని చేర్చుకొన్నారు. ఒక ఏడేళ్లపాటు అతడు ఉత్తమ శ్రేణికి చెందిన ధార్మిక పాఠశాలలను దర్శించాడు. ఈ అనుభవం ద్వారా అతనికి మఠ జీవితం బాగా నచ్చి, తాను బౌద్ధభిక్షువు నౌదామని నిశ్చయించుకొన్నాడు.

ఇరవైయవ ఏటనే బౌద్ధభిక్షువుగా అన్ని అర్హతలూ సంపాదించాడు హ్యూయెన్‌త్సాంగ్. బౌద్ధ మతాన్ని గురించి తనకు గాని, తన దేశంలో ఎవరికి గాని తెలిసినది చాలా తక్కువని, తెలియని విషయాలే ఎక్కువని గ్రహించాడు. తాను ఎంతో పాండిత్యము సంపాదించిన విద్వాంసుడయినా బౌద్ధమత సిద్ధాంతాలను గురించి తనకు స్పష్టంగా తెలియదు. తాను భారతదేశం వెళ్లి, స్వయంగా మూల గ్రంథాలను పఠిస్తేనే తన సందేహాలను తొలగించుకోవచ్చునని అతనికి తోచింది.




హ్యూయెన్‌త్సాంగ్

అందుకని, ఫాహియాన్ వలెనే తాను కూడా తన 29 వ యేట భారతదేశం లోని పవిత్ర స్థలాలను దర్శించి, అక్కడి బౌద్ధ విద్వాంసులతో అధ్యయనం చేసి బుద్ధుడు బోధించిన ధర్మ సూత్రాలను గురించిన వాస్తవజ్ఞానం సంపాదించాలని నిశ్చయించాడు.

చైనా చక్రవర్తి అతని యాత్రకు అనుమతి ఇయ్యలేదు. కాని క్రీ. శ. 629 లో చడీ చప్పుడూ లేకుండా దేశం విడిచి బైలుదేరాడు. అతని యాత్రా మార్గాన్ని నిర్దేశించే పటాన్ని చూస్తే, ఉత్తర భూమార్గం ద్వారా భారతదేశం చేరుకుని, దక్షిణ భూమార్గం ద్వారా తిరిగి చైనా చేరుకున్నాడని తెలుస్తుంది. ఆ రోజుల్లో ప్రయాణ సౌకర్యాలు ఏమాత్రమూ లేవు. 15,000 మైళ్ల పొడవునా ఎడారులూ, కొండలూ, కొత్త దేశాలూ దాటుకుంటూ యాత్ర సాగించాలంటే ఎదుర్కోవలసిన కష్టాలూ, ప్రమాదాలూ అనేకం. ఫాహియాన్ వలెనే హ్యూయెన్‌త్సాంగ్ కూడా స్వదేశం విడిచి 15 ఏళ్ల పాటు పై దేశాలలో పయనించాడు. (క్రీ. శ. 629 – 644) ఈ సమయంలో ఎక్కువ భాగం అతడు హర్షచక్రవర్తి రాజ్యంలోను, భారత దేశపు వివిధ స్థలాల యాత్రలలోను గడిపాడు.

ఫాహియాన్‌కు 200 ఏళ్ల తరువాత తాను దర్శించిన దేశాలలో బౌద్ధమతపు స్థితిగతులను గురించి హ్యూయెన్‌త్సాంగ్ ఏమని వ్రాశాడో! ప్రతి దేశంలోను బౌద్ధమతానికి అఖండ గౌరవం లభిస్తూండేది. మన యాత్రికుడికి మధ్య ఆసియా లోని రాజ్యాల పాలకులు అన్ని విధాలా తోడుపడ్డారు. ముఖ్యంగా ఒక దేశపు రాజు అతనిని ఎన్ని విధాలుగానో మర్యాద చేశాడు. అతనిని శాశ్వతంగా తన రాజ్యంలో ఉండిపోయి, తన ప్రజలను బౌద్ధ ధర్మానుసారులుగా వర్తించేటట్లు తోడుపడమని కోరాడు. తన దీర్ఘ యాత్ర అటువంటి అల్ప ప్రయోజనం కోసం కాదు కనుక హ్యూయెన్‌త్సాంగ్ రాజు మాట కాదనడానికి బాధ పడ్డాడు. తన రాజ్యంలో ఉండిపొమ్మని రాజు బలవంతం చేస్తాడేమో అని భయపడి, అతడు ప్రాయోపవేశం (ఉపవాసం) చేశాడు. రాజుకు అది తెలిసి, తన కోరిక ఉపసంహ రించుకున్నాడు. తిరిగి వచ్చేటప్పుడు తన దేశానికి తప్పకుండా వస్తానని వాగ్దానం తీసుకుని హ్యూయెన్‌త్సాంగ్ వెళ్లడానికి రాజు సమ్మతించాడు.

శాశ్వతంగా మంచుతో కప్పబడిన పర్వతాలను దాటి, హ్యూయెన్‌త్సాంగ్ బంగారు జరీ డేరాలలో కొలువు తీర్చిన తురుష్కరాజు రాజ్యం ప్రవేశించాడు. ఆ రాజూ సామంతులూ మత్తు పానీయాలకూ, సంగీతానికీ చెవికోసుకునేవారు. అయి నప్పటికీ ఆ రాజు హ్యూయెన్‌త్సాంగును తన కొలువుకు సగౌరవంగా ఆహ్వా నించాడు. యాత్రికుని యాత్రకు కారణమును తెలిసికొన్న తురుష్కరాజు "హిందూస్థాన్‌కు వెళ్లడం ఎందుకు? అక్కడి ప్రజలు విదేశీయుల యెడల మోటుగా ప్రవర్తిస్తారు" అని చెప్పాడు. కాని హ్యూయెన్‌త్సాంగ్ మనోనిశ్చయం మారలేదు. రాజు అతని యాత్రకు అడ్డు తగలదలుచుకోలేదు. పైగా అతని యాత్రలో కావలసిన సదుపాయాలెన్నో ఏర్పాటు చేయించాడు. ఆఫ్ఘనిస్తాన్ ప్రజలభాష హ్యూయెన్‌త్సాంగ్‌కు అర్థం కాదని, అతనితో కూడా ఒక అనువాద కుణ్ణి తోడు పంపాడు.

బాల్ఖ్, బామియాన్ దేశాలలో కనిష్కుడు నాటిన బౌద్ధధర్మ బీజాలు 500 ఏళ్ల తరువాత కూడా చక్కగా వేరూని, వర్ధిల్లుతున్నవని హ్యూయెన్‌త్సాంగ్ గ్రహించాడు. అక్కడ అతడు ఎన్నో కట్టడాలను బౌద్ధ అవశేషాలను దర్శించాడు. అక్కడి మఠాలలో పూజాస్థానంలో ఉండిన బుద్ధుని జలపాత్ర, తుడిచే చీపురు, దంతము, మున్నగు అవశేషాలను అక్కడి భిక్షువులు ఫాహియాన్‌కులాగే హ్యూయెన్‌త్సాంగ్‌కు కూడా చూపించారు.

హిందూకుష్ పర్వతాలను దాటి హ్యూయెన్‌త్సాంగ్ బౌద్ధమతము సుస్థిరంగా నెలకొనిఉన్న కాబూలు లోయలో ప్రవేశించాడు. అక్కడ ఉండే కట్టడాలు చాల మట్టుకు బుద్ధుని మహిమలకు సంబంధించినవే. బుద్ధ నిర్యాణానికి వెయ్యి సంవత్సరాల తరువాత అక్కడి ఒక రాతిగుహలో బుద్ధదేవుని నీడను దర్శించానని హ్యూయెన్‌త్సాంగ్ అతి విశ్వాసంతో వ్రాశాడు.

అతడు బహుశా ఖయిబర్ కనుమగుండా భారతదేశంలోనికి ప్రవేశించాడు. వాయవ్య ప్రాంతంలోని చాలా పట్టణాలు, పల్లెలు, నిర్మానుష్యములై కనబడ్డాయి. పెషావర్ లోయ మాత్రం ఇప్పటిలాగే అప్పుడుకూడా పంటలతో ఫలవృక్షాలతో కలకలలాడుతూ ఉండినది. మెగస్తనీస్‌లాగే ఇతడు కూడా చెరకు గడనుండి

చక్కెర ఉత్పత్తికావడం చూసి ఆశ్చర్యం చెందాడు. ప్రసిద్ధ సంస్కృత వ్యాకరణ కర్త పాణిని నాలుగవ శతాబ్దంలో జన్మించినచోటు ఈ ప్రాంతంలోనే ఉన్నదని పురుషపురం (పెషావర్) లో విన్నాడు. ఉత్తరదిశకు ప్రయాణించి పాణిని జన్మించిన స్వాత్ పట్టణం దర్శించాడు.

సింధునదిని దాటి కాశ్మీరదేశం దర్శించాడు. అది కనిష్కచక్రవర్తి నాటి నుండి సంస్కృత విద్వాంసులకు పేరుపడినది. అక్కడ అతడు చాలా స్థూపాలను, బౌద్ధభిక్షువులు నివసించే మఠాలను చూశాడు. కాశ్మీర మహారాజు అతనిని గౌరవించి, అతనికి కావలసిన మత గ్రంథాల ప్రతులు వ్రాసిపెట్టడానికి ఇరవైమంది వ్రాతగాళ్లను ఏర్పాటు చేశాడు. తన పని పూర్తయేవరకు హ్యూయెన్‌త్సాంగ్ కాశ్మీరంలో రెండేళ్లు ఆగాడు.

కాశ్మీరం నుంచి తిరిగివస్తూ, అతడు చెహీకా (పశ్చిమ పాకిస్తాన్‌లోని ఇప్పటి సియాల్‌కోట లేక బహుశా శాకలపురం) మీదుగా ప్రయాణం చేశాడు. ఈ స్థలం తేలికైన సన్నని వలిపాలకు (మజ్లిన్ బట్టలకు) ప్రసిద్ధిచెందిందని హ్యూయెన్‌త్సాంగ్ వ్రాశాడు. కులూ లోయ, జలంధర్‌ల మీదుగా మధురవైపు ప్రయాణిస్తూ ఆనాడు ఉత్తర భారతదేశంలో సార్వభౌముడయిన హర్షచక్రవర్తి రాజ్యం ప్రవేశించాడు. ధనేశ్వర్ (స్థానేశ్వర్), కురుక్షేత్రానికి చుట్టుపక్కల ఉండే దేశం అంతా ప్రాచీన కాలం నుండి ధర్మక్షేత్రమని పేరుపొందినది.

తాను మధురనుంచి కనౌజి వెళ్లడం గురించి వ్రాస్తూ, హ్యూయెన్‌త్సాంగ్ భారతదేశపు పవిత్ర నదియైన గంగను గురించి ప్రశంసిస్తాడు. "జన్మ జన్మల పాపాలు ఒక్కసారి ఈ నదిలో స్నానం చెయ్యగానే క్షాళితమైపోతాయి. ఇందులో మునిగిపోయినవారు స్వర్గంలో సుఖంగా జన్మిస్తారు. చనిపోయినవారి ఎముకలు ఈ నదిలో కలిపితే, అతని ఆత్మకి ఉత్తమ లోకాలు ప్రాప్తిస్తాయి." ఎన్నో వందల యేళ్ల క్రితం ఏర్పడిన ఈ విశ్వాసం ఈ నాటి హిందూమతంలో కూడా స్థిరంగా పాతుకు పోయినదే.

కనౌజి రాజ్యమును శిలాదిత్య (హర్షవర్ధన) చక్రవర్తి పరిపాలిస్తూ ఉండే

వాడు. హర్షుడు ఉత్తముడనీ, శక్తిమంతుడైన పరిపాలకుడని హ్యూయెన్‌త్సాంగ్ గ్రంథం ద్వారా తెలుస్తుంది. హర్షుడు తన రాజ్యం అంతటా యాత్రికులకు విశ్రాంతి గృహాలను, లెక్కలేనన్ని బౌద్ధ మఠాలను కట్టించాడట.

గంగలో ముఖద్వారం వైపు ప్రయాణం చేస్తుండగా హ్యూయెన్‌త్సాంగ్ పడవను బందిపోటు దొంగలు ఎదుర్కొన్నారు. తరువాతి కాలపు థగ్గులవలెనే



హ్యూయెన్‌త్సాంగ్ నౌకపై సముద్రపు దొంగలదాడి

ఆ దొంగలు దుర్గాదేవిని పూజించేవారుట. అమ్మవారికి నరబలి యిచ్చేవారట. దొరికిన మనుష్యులు అందరిలోకి అందమైన వ్యక్తిని బలి యివ్వడం వారి ఆచారం. దాని ప్రకారం వాళ్లు హ్యూయెన్‌త్సాంగ్‌ను బలి ఇయ్య గోరారట. హ్యూయెన్‌త్సాంగ్ ఎంత మాత్రము భయపడకుండా, బుద్ధదేవుని ప్రార్థించు కోడానికి వారి అనుమతిని కోరాడుట. అతడు ఎంతో దూరంనుంచి వస్తున్న పుణ్యమూర్తి అని గ్రహించి, దొంగలు అతనిని చంపడం మాని వేయడమే



కాకుండా, మిగిలిన అందరు యాత్రికులకూ చెందిన సొమ్ములను ఎవరివి వారికి ఇచ్చేసి వెళ్లిపోయారు.

ప్రయాగ (ఇప్పటి అలహాబాదు) చేరుకొన్నాక అతడు అక్కడ బౌద్ధులు అంతగా లేరని తెలుసుకొన్నాడు. అక్కడి నుంచి, బుద్ధుని జీవితంతో సంబంధం ఉండిన శ్రావస్తి, కపిలవస్తు, కుశినగర, వారణాసి, సారనాథ్, గయ, వైశాలి, పాటలీపుత్రము, రాజగృహము మున్నగు స్థలాలను దర్శించాడు. ఈ ఊళ్లన్నీ ఒకప్పుడు ప్రసిద్ధికెక్కిన యాత్రాస్థలాలు. ఫాహియాన్ నాటికే ఇక్కడ జనసంచారం తగ్గిపోయి హ్యూయెన్ త్సాంగ్ కాలంనాటికి జనసంచారం మరీ పలచబడి పోయింది. అశోకుడు కట్టించిన కట్టడాలు కూడా చాలమట్టుకు శిధిలావస్థకు వచ్చాయి.



దిగమొల సాధు

వారణాసిలో కనబడిన దృశ్యం పూర్తిగా వేరు. జనంతో క్రిక్కిరిసి, సంపదతో తులతూగుతోంది. ప్రజలలో అధిక సంఖ్యాకులు శివభక్తులు, బ్రాహ్మణులను గౌరవించేవారు. బౌద్ధులు కొద్దిమంది ఉండేవారు.

సాధువులు దేశంలో ద్రిమ్మరులుగా తిరుగుతూండేవారు. కొందరు నగ్నంగా కొందరు భస్మధారులుగా చాలామంది హఠయోగ సాధన ద్వారా ఐహిక జీవితం నుంచి ముక్తికై యత్నిస్తున్నట్లు కనబడింది హ్యూయెన్‌త్సాంగ్‌కు.

చివరికి హ్యూయెన్‌త్సాంగ్ తన గమ్యస్థానమైన మగధ దేశం చేరుకున్నాడు. తన యాత్రలో అయిదు సంవత్సరాలు గడిపిన మగధ

దేశాన్ని ఎంతో మెచ్చుకుంటూ వర్ణించాడు. అతను ఎక్కువకాలం నలందా విహారంలో గడిపాడు. అక్కడ 10,000 మంది భిక్షువులు ఐసచేశారు. ఇక్కడ సంస్కృతం నేర్చుకొని అఖండమైన జ్ఞానం సంపాదించాడు.



ధ్యానముద్రలో సాధువు

మగధ దేశంలో ఒక పర్వత ప్రాంతంలో నలందా విహారం ఉండేది. అక్కడికి బుద్ధుడు దివ్యజ్ఞానం సంపాదించిన స్థలానికి ముప్పది మైళ్ల దూరం. బుద్ధ భక్తులైన రాజులు ఈ విహారానికి ఉదాత్తమైన కట్టడాలను కట్టించారు. అన్ని పక్కలా శిఖరాలతో, గోపురాలతో, ప్రవహించే వాగులతో, చెట్లతోపులతో, విహారం చల్లగాను, శుభ్రంగాను ఉండేది. ఒకే గోడ ఆవరణలో ఆరు మఠాలు ఉండేవి. ఆరు అంతస్థుల కట్టడంలో భిక్షువులు నివసించేవారు. రాజూ, చుట్టు పక్కల నగరాలలోని ప్రజలూ విరాళాలిచ్చి, ఇక్కడి 10,000 భిక్షువులను పోషించేవారు. నలందా భారతదేశంలో గొప్ప సంస్కృతి కేంద్రం. ఇక్కడ బౌద్ధ వాఙ్మయమే కాకుండా, వేదాలు మొదలు వైద్యమూ, గణితమూ మొదలైన అన్ని శాస్త్రాలలోను విద్య గరపేవారు. చైనా యాత్రికుని వంటి విదేశ విద్యార్థులిక్కడికి వచ్చి జ్ఞానం సంపాదించేవారు. వారికి అప్పటికి ముందుగా ఎంత జ్ఞానం ఉన్నదో కఠినమైన పరీక్షచేసి తెలిసికొన్నాక గాని ప్రవేశం ఇచ్చేవారు కాదు. అటువంటి పరీక్షకు వచ్చిన పది మందిలో ఏ ఒకరిద్దరికో మాత్రమే ప్రవేశం లభించేది. ప్రతి రోజూ ఆచార్యులు వందమంది దాకా అన్ని శాస్త్రాలూ నేర్పే

వారు. వాళ్ళక్కడ ఏవో పైగానో పుస్తకాలు రచించినవారు. అక్కడ విద్యార్థులైన భిక్షువులకు రుసుము లేకుండా తిండీ, బట్టా, బసా, ఔషధ సదుపాయాలూ ఇచ్చే వారు. నలందా విహారపు అధ్యక్షుడయిన శీలభద్రునకు పిల్లవ్వాడు భక్తి వినయ గౌరవాలు చూపి, విద్యార్థిగా ఆయన ద్వారా అశేషమైన గౌరవాదరములు పొందినాడు: ఒక శ్రమణ (బౌద్ధ) సన్యాసి, ఒక బ్రాహ్మణ (హిందూ) సన్యాసీ హ్యుయెన్ త్సాంగ్‌కు కావలసిన అన్ని సదుపాయాలూ జరిగేటట్లు చూసే వారు. అతనిని వారు రోజూ రథం పైనిగాని, ఏనుగు పైనిగాని, పల్లకీలో గాని కావలసిన చోటులకు తీసుకు వెళుతూండే వారు.

మగధ దేశం వదలిన తరువాత, హ్యుయాన్‌త్సాంగ్ భారత దేశంలోని మిగిలిన దేశాలను సందర్శించాడు. అతడు మొదట చంపా, కర్ణసువర్ణ, సమతట, తామ్రలిప్తి దేశాలకు వెళ్ళాడు. తరువాత ఒరిస్సా తూర్పు తీరమునగల కళింగ దేశము ద్వారా ప్రయాణించి, దక్షిణ కోసల (బిరార్), ఆంధ్ర, దేశములను దర్శించాడు. అక్కడ నుండి దక్షిణంగా ద్రావిడ దేశంలోని కాంచీపురం (కంచి, లేక కంజీవరం) వరకు వెళ్ళాడు. ఆ తరువాత కొంకణపురం దర్శించాడు. అది ఎక్కడిదో చరిత్రకారులకు స్పష్టంగా తెలియలేదు. (ఇది కొంకణ దేశం అనబడే గోవా ప్రాంతంలోనిది కావచ్చు.) పశ్చిమ ప్రాంతంలోని మహారాష్ట్రం అతను తరువాత చూసిన దేశం. ఇక్కడ అశోకుడు నిర్మించిన బౌద్ధ కట్టడాలను దర్శించాడు. "ఇక్కడి ప్రజలు పౌరుష వంతులు, యుద్ధప్రియులు, ఉపకారులకు కృతజ్ఞులు, అపకారుల యెడల పగా కలిగి ఆపదలో ఉన్నవారికి సాయం చెయ్యడంలో ఆత్మత్యాగానికి వెనుదీయని వారు, తమను అవమానించిన వారితో పోరాడ వలసివస్తే చావుకైనా భయపడని వారు" అని వ్రాశాడు హ్యుయాన్‌త్సాంగ్. రెండవ పులకేసి నాయకత్వమున హర్షచక్రవర్తి నెదిరించి గెలిచినవారు అటువంటి వీరులన్నమాట.

మహారాష్ట్రం నుంచి ప్రాచ్య మీదుగా మాళ్వదేశం చేరుకొన్నాడు. అక్కడి ప్రజలు శాంత మూర్తులు, మర్యాదస్థులు. సంస్కృతీ, వివేకమూ ఉదాత్తమైన



ఒక పరిషత్తులో అధ్యక్షుడుగా హ్యూయెన్ త్సాంగ్

ఆ వెంటనే హర్షుడు హ్యూయెన్‌త్సాంగ్‌తో కలిసి, ఏనుగుపై ఎక్కి ఊరేగుతూ చైనాదేశపు ధర్మశాస్త్రవేత్త పాండిత్యాన్ని గురించి ప్రజలందరికీ ప్రకటించాడు.

ఇప్పుడు హ్యూయెన్‌త్సాంగ్ స్వదేశానికి వెళ్లిపోవడానికి సిద్ధం అయినాడు. నలందాలోని సోదర భిక్షుకుల నుంచి సెలవు తీసుకొన్నాడు. కాని, హర్షుడు అతనిని తనతో ప్రయాగలో త్రివేణీ సంగమం వద్ద జరగబోవు అరవ పంచ వర్షీయ మహాసభకు విచ్చేయమని పట్టుపట్టాడు.

అది గొప్ప సమావేశం. ప్రయాగలో రాజుగారినుంచి దక్షిణలను స్వీకరించడానికి గాను 5 లక్షలమంది సమావేశమయినారు. బంగారు, వెండి, వస్త్రాలు, దానం చెయ్యడానికి ప్రోగుచేసిన ఇతర వస్తువులను భద్ర పరచడానికే ఎన్నో పందిరులు కట్టవలసి వచ్చింది.

దక్షిణ లియ్యడం పూర్తయాక దేవారాధన కొనసాగింది. మొదటి రోజున బుద్ధదేవుని బంగారు విగ్రహమునకు బ్రహ్మాండమైన ఊరేగింపు చేశారు; రెండవ రోజు సూర్యదేవునకు, మూడవ రోజున శివునకు అదే విధంగా ఊరేగింపులు జరిగాయి. హ్యూయెన్‌త్సాంగ్‌కు వెయ్యి బంగారు నాణెములు కానుకగా ఇచ్చారు. తాను జ్ఞాన సముపార్జనకై వచ్చాను గాని ధనం కోసం కాదని ఆ కానుకను అతను తిరస్కరించాడు.

ప్రయాగలోని మహా సభ పూర్తి కాగానే బౌద్ధమతానికి సంబంధించిన అనేక సామగ్రితో చైనా యాత్రికుడు భారతదేశం నుంచి బైలుదేరాడు. రెండు బంగారపువీ, ఒక వెండిదీ, మూడు చందనపువీ బుద్ధ విగ్రహాలూ, బుద్ధునికి సంబంధించి జ్ఞాపకం ఉంచుకోతగ్గ వస్తువులు 150, 22 గుర్రాలపైని అతడు సేకరించిన 657 గ్రంథాలు, హ్యూయెన్‌త్సాంగ్ తనతో తీసుకువెళ్లాడు. అతని జీవిత కాలంలో మిగిలిన భాగం అంతా, చైనా బౌద్ధభిక్షువులు, ఇద్దరు భారతీయ సన్యాసులు సహకరించగా, తాను తీసుకువెళ్లిన సంస్కృత గ్రంథాలను చైనా భాషలోకి తర్జుమా చేశాడు.

హ్యూయెన్‌త్సాంగ్ యాత్ర ముఖ్యోద్దేశం స్పష్టంగా మతపరమైనదే కాని,

లేదు. రాజులు నేరస్థులకు విధించే శిక్షల కాఠిన్యం వల్లను, శిక్షలు అలవ్యాయ కుండా అమలు జరుపుతూ ఉండడం వల్లను, నేరములు కొద్దిగానే జరిగేవని చెప్పాలి.

ఉత్తరమున హిందూకుష్ పర్వతముల నుంచి ద్వీపకల్పపు దక్షిణాగ్రము వరకును, తూర్పున తామ్రలిప్తి (గంగా ముఖద్వారం) నుంచి పడమర సింధు నదికి ఆవల బహుదూరము వరకును గల దేశం అంతటా అశోకుని స్తూపములు వ్యాపించి ఉండినవని హ్యూయెన్‌త్సాంగ్ వ్రాశాడు. ఫాహియాన్, హ్యూయెన్ త్సాంగ్‌ల ఇరువురి గ్రంథాలు కలిపి చదివితే బుద్ధుని జీవితంలో చాలమట్టుకు కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. అంతేకాదు; భారతదేశంలోను, విదేశాలలోను బౌద్ధమత ప్రభావం ఎంత గాఢంగా అల్లుకొన్నదో తెలుస్తుంది. బౌద్ధమతపు ఆచారాలు, విశ్వాసాలు ఈనాటి హిందూ మతంలో ఎలా తెలియకుండా కలిసి పోయాయో తెలుస్తుంది. ఉదాహరణకి హిందూ మతాచారాలలో ఒకటి అయిన విగ్రహారాధన గురించి పరిశీలిద్దాము. మగధ రాజయిన బింబిసారుని కాలంలో తొలిసారిగా బుద్ధుని బొమ్మ తయారుచేశారని హ్యూయెన్‌త్సాంగ్ వ్రాశాడని మనం కొన్నాము. ఒక తెర పై పడిన బుద్ధుని నీడను రంగులతో నింపి చిత్రం పూర్తి చేశారు. అలాగే బుద్ధుని తొలి విగ్రహం కోసల రాజ్యంలో చందనంతో చేశారని ఫాహియాన్ వ్రాతల ద్వారా తెలిసింది. కనుక విగ్రహారాధన పనికిరాదని బుద్ధుడు స్పష్టంగా నిషేధించినప్పటికి హిందూ మతాచారాల ప్రభావం వల్ల బుద్ధుని చిత్రాలు, విగ్రహాలు బైలుదేరి పూజాస్థానం స్వీకరించాయి. ఈ చిత్రాలనూ విగ్రహాలనూ మొదట ఆయన పవిత్ర సాన్నిధ్యాన్ని స్మరించుకోడం కోసం నెలకొల్పడం మొదలుపెట్టారు. క్రమంగా కొన్నేళ్లు గడిచేసరికి, వాటి చుట్టూ కొన్ని మూఢ విశ్వాసాలూ మహిమలను చాటే గాథలూ చేరాయి. ఆ తరువాత బుద్ధుని అవశేషాలలో ముఖ్యంగా ఎముకలూ, భస్మమూ, (దంతములూ) ఆయన వ్యక్తిగత జీవితంలో వాడుకొన్న వస్తువులూ, అవన్నీ కూడా చిత్రాలూ, విగ్రహాలతో పాటు పూజా స్థానం అలంకరించాయి. కాలం గడిచిన కొద్దీ వీటి సంఖ్య మరీ పెరుగుతూ వచ్చింది. బుద్ధుడు సందర్శించిన అనేక స్థలాలలో శిలల పై అచ్చొత్తిన ఆయన పాద చిహ్నాలు కనబడతాయి. అటువంటి



హ్యూయెన్‌త్సాంగ్ స్వదేశ యాత్రా పటము

స్థలాలలోనే స్థూప నిర్మాణం జరిగింది. అశోకుడొక్కడే అటువంటి పవిత్రమైన కట్టడాలను 84,000 దాకా నిర్మింపజేశాడట.

కాలం గడిచినకొద్దీ బుద్ధుని ప్రధాన శిష్యులకు కూడా పుష్పాలతో ప్రార్థనలతో అర్పించే పూజాస్థానం లభించింది. ఆలయాలలోను, మతసంబంధమైన ఊరేగింపులలోను, బుద్ధునితో ఆయన శిష్యులతోపాటు హిందూ దేవతలకు కూడా పూజ చేసేవారు. ఇలా శాఖలు కలిసి ఈ విధంగా రెండు మతాలూ సన్నిహితము

లయినాయి. చివరికి బుద్ధునితోపాటు అనేక దేవతలను పూజించే నేటి హిందూ మతం ప్రారంభమైంది.

మఠాలలో కూడా అభిప్రాయాలూ ఆచారాలు అదే విధంగా కలిసిపోయాయి. బుద్ధుడు తాను బోధించిన కఠిన నియమాలను ఆచరణలో పెట్టుతూ బౌద్ధ ధర్మమును శక్తిమంతముగా కొనసాగేటట్లు పాటుపడే శ్రమణులను (సన్యాసులను) ఒక సంఘముగా ఏర్పాటు చేశాడు. దేశం అంతటా విహారాలు (మఠాలు) నిర్మించారు గాని, శ్రమణుల సంఘము అన్నిచోట్లలా ఒకే విధముగా పనిచేసే ధార్మికశక్తిగా రూపొందలేదు. అందుకు ఎట్టి ప్రయత్నమూ జరగలేదు. సన్యాసులూ మఠాలూ ఒక్క బౌద్ధమతానికే ప్రత్యేకం కాదు. బౌద్ధులతోపాటు హిందువులూ జైనులు కూడా మఠాలు నిర్మించుకొన్నారు. ఒక్కొక్కప్పుడు అవీ ఇవీ పక్కపక్కనే ఉండేవి; అజంతా, ఎల్లోరా గుహలలోని మఠాలే ఇందుకు ఉదాహరణ. కాలక్రమాన మూడు మఠాలలోను, ఈ విషయంలో ఒకేవిధమైన పరిణామం కనబడుతుంది.

భారతదేశపు సంస్కృతి చరిత్రలో మతసహనానికి ప్రాధాన్యం లభించింది. తన మత విశ్వాసం విషయంలో ప్రతి వ్యక్తికీ స్వేచ్ఛ ఉంది. చర్చనీయములైన అంశములున్నపుడు శాస్త్రార్థము, లేక ధర్మశాస్త్ర చర్చలు చేసి, సమస్యలను స్పష్టపరచేవారు. విభిన్నమతాలకు చెందిన విద్వాంసుల నడుమ వాదంలో భేదం తప్ప, వ్యక్తిగత సద్భావం మాత్రం చెక్కుచెదరకుండా ఉండేది.

ప్రజా జీవితంలో అన్ని రంగాలలోను మత సహనభావము వెల్లివిరిసి ఉండేది. ఈ సద్భావానికి వారసత్వముగా పరిణమించినదే నేటి మన మత నిర్బంధము లేని రాజ్యాంగము – కులమత వర్ణములేవైనా ప్రజలందరూ సమానముగా అందరికీ సుఖసంపాదనకు సమానావకాశాలను ఇచ్చే రాజ్యాంగము!!

## అల్ బెరూని నాటి భారతదేశం

అల్ బెరూని అనే పేరుతో అందరికి తెలిసిన అబూారైహాన్ అనే ముస్లిమ్ విద్వాంసుడు వెయ్యి సంవత్సరాల క్రితం భారతదేశానికి వచ్చిన విదేశ యాత్రికుడు. ముఖ్య విదేశ యాత్రికులలో ఇతడు నాలుగవవాడు.

మధ్య ఆసియాలోని ఖివా అనేరాజ్యంలో క్రి. శ. 973 లో జన్మించాడు. గొప్ప విద్వాంసుడుగా పెరిగి పెద్దవాడయినాడు. నలభైయేళ్ళు వచ్చేసరికి విజ్ఞాన శాస్త్రము, గణితము, ఖగోళశాస్త్రము, జ్యోతిషము ఈ విషయముల అరబ్బీ భాషా గ్రంథాలను అన్నింటినీ క్షుణ్ణంగా చదువుకొన్నాడు. తన రాజ్యంలో సంభవించిన విపరీత పరిస్థితులు అతని జీవితంలో మార్పు తెచ్చి ఉండకపోతే అతడు స్వదేశంలోనే భాషాసేవ చేస్తూ ఉండేవాడు. ఘజ్నీసుల్తాను అయిన మహమూద్ ఖివా రాజ్యం పైని దండెత్తి వచ్చాడు. 11 వ శతాబ్దవు తొలి భాగంలో భారత దేశం పైకి దండెత్తి వచ్చిన ఘజ్నీమహమూద్ ఇతడే. సుల్తాన్ ఖివారాజ్యాన్ని నాశనం చేసి, ఆ రాజ్యపు సుల్తానును, సేనానులను, అల్ బెరూనీని ఖైదీలుగా ఘజ్నీకి తీసుకొని పోయాడు. ఆ తరువాత వారిని దేశంనుంచి తరిమివేయటం వల్ల అల్ బెరూని భారతదేశానికి రావలసి వచ్చింది.

అల్ బెరూని ఆ కాలం అంతా సంస్కృత భాషా వాఙ్మయం నేర్చుకొనడానికి వినియోగించాడు. సంస్కృతం నుంచి కొన్ని గ్రంథాలను అరబ్బీ భాషలోనికి అనువదించాడు. అరబ్బీలో వ్రాసిన 20 గ్రంథాలలో భారత దేశం గురించి వ్రాసినది చాలా ప్రసిద్ధి చెందినది. ఈ విద్వాంసునకు హిందువుల బుద్ధి వికాసము చాలా మనోజ్ఞంగా కనబడింది.

భారత దేశంలోని మత సంప్రదాయాలను గురించి, సాహిత్య, వైజ్ఞానిక

అల్ బెరూని వర్ణించిన భారతీయ ఖగోళ విజ్ఞానం

సంప్రదాయాలను. గురించి వర్ణించడమే అతని ప్రధానాశయము. అయితే దేశమును గురించీ, ప్రజల అలవాటులు, ఆదారములు, మూఢ విశ్వాసములు మున్నగు వాటిని గురించీ కూడా విలువైన సమాదారమును తెలియజేశాడు.

భారతదేశం (అనగా అల్ బెరూని చూసిన ఉత్తర భారతము) అతి ప్రాచీన కాలములో ఒక సముద్రమనీ, శతాబ్దాల తరబడి హిమాలయ పర్వతాలలోని నదులు ఆ సముద్రములో కలుస్తూండేవని వ్రాశాడు. ఈ విషయమును ఇతర యాత్రికులు తమ వ్రాతలలో సూచించనప్పటికీ, ఆధునిక వైజ్ఞానికులు మాత్రం బాయపరిచారు. భారత దేశంలోని పర్వతాలను, నదులను గురించి క్లుప్తంగా వర్ణించాడు. ఉత్తర భారత దేశపు కేంద్రస్థానముగా ఉండిన కనౌజినుంచి



ముఖ్యమైన స్థలాలు, ఏ యే దిక్కుల ఎంతెంత దూరమున ఉన్నవో వివరంగా వర్ణించాడు. ఈ స్థలాలలో కొన్ని ఈనాడు శిథిల నగరాలుగానో, లేదా పాడు వడిన దిబ్బలుగానో కనిపిస్తాయి.

భారత దేశవు జంతువులను గురించి వ్రాస్తూ, ఉత్తర భారత దేశవు నదులు మొసళ్లతో కిట కిటలాడుతూ ఉంటాయన్నాడు. ఖడ్గ మృగాలు చాలా ప్రాంతా



శరభము అనే ఎనిమి
కాళ్ల వింతజంతువు

లలో ఉండేవి. మెగస్తనీస్‌లాగే అల్ బెరూనీ కూడా ఒక పౌరాణిక (లేక, కట్టు కథల) జంతువు ఉండేదని కూడా వ్రాశాడు. కొంకణ ప్రాంతపు పల్లాలలో శరభం అనే వింత జంతువు ఉండేదని అతనికి ఎవరో చెప్పారు. మామూలుగా నిలబడే నాలుగు కాళ్ళూ కాక దానికి వీపు మీద మరి నాలుగు కాళ్ళు ఉండేవట. దాని ఆకారం దున్నపోతు (బర్రె) వలె ఉండి, ఖడ్గమృగం కంటె పెద్ద పరిమాణంలో ఉండేదిట. అది భయంకరంగాను క్రూరంగాను ఉండి, తన యెరను పైకి విసిరి పట్టుకుని వీపు మీది నాలుగు కాళ్ళతోను బంధించేది. పిచ్చి కోపంలో ఉన్నప్పుడు కొండ శిఖరానికి ఎక్కి అక్కడినుంచి ఉరుముతో ఢీకొన డానికి ముందుకు దుమికేవట. మనదేశంలో నాలుగు కళ్ళ లేడులూ దుప్పులూ ఉండేవని కూడా అల్ బెరూనికి ఎవరో చెప్పారట.

మెగస్తనీస్ వ్రాసిన కట్టుకథలకు అల్ బెరూనీ వ్రాసిన వాటికీ తేడా ఉంది. బంగారం తవ్వితీసే చీమలను గురించి తాను విన్న కథలను గ్రీకు యాత్రికుడు నిజమని నమ్మాడు. వైజ్ఞానిక దృష్టిగల అరబ్ యాత్రికుడు శరభాలను, దుప్పు లను గురించి తాను విన్న మాటలను 'అట' అని విన్న మాటలుగానే వర్ణించాడు.

అల్ బెరూని భారతీయులను గురించి వారు సాధించిన గొప్ప విషయాలను గురించి వ్రాయగోరాడు. కాని ఇక్కడి ప్రజల మనస్తత్వం తనకి అర్థంకావడానికి చాలా కష్టపడ్డానని వ్రాశాడు. భారతీయుల సాహిత్య గ్రంథాలన్నీ సంస్కృత కావ్య భాషలో ఛందోబద్ధములై కంఠతాపట్టి జ్ఞాపకం పెట్టుకోడానికి వీలుగాఉన్న వనీ, అరబ్బీకన్నా పర్షియన్ కన్నా సంస్కృత భాష కఠినమైనదనీ వ్రాశాడు.

అదీకాక, భారతీయులలో అంతగా సహాయ పడని వైముఖ్య భావం కన బడిందతనికి. వారు గర్విష్ఠులనీ, సంకుచిత మనస్కులనీ, ఇతరులు చెప్పిన మంచిని కూడా తెలిసికోలేని మూర్ఖత కలవారనీ, తమ ఆచారాలలోను అభ్యాసా లలోను ఉండే లోటుపాటులను విమర్శించుకోలేని వారు విదేశీయులందరి యెడలా అపోహ కలిగి ఉండేవారు అనీ వ్రాశాడు. విదేశీయులను మ్లేచ్ఛులని వ్యవహ రించి, వారి ఆచారాలను, అభ్యాసాలను, వారి వేష పద్ధతులను కూడ, అస

హ్యించుకొనేవారట. "హిందువుల ఉద్దేశంలో తమ దేశము వంటి దేశం లేదు. తమ జాతివంటి జాతి లేదు; తమ రాజువంటి రాజులు లేరు; తమ మతము వంటి మతము లేదు; తమ శాస్త్రజ్ఞానమునకు సాటిలేదు; తమ దేశపు ప్రజలలోనే తమ కులానికి చెందనివారికే తెలియనీయని శాస్త్రజ్ఞానము విదేశీయులకు అసలు తెలియకూడదని భావించేవారు" అని అల్ బెరూనీ వ్రాశాడు.

అల్ బెరూనీ భారత ప్రజల ఆచారాలనూ జీవిత పద్ధతినీ గురించి ఎన్నో వ్యాఖ్యలు చేశాడు. "హిందువులు ముందు కాళ్లు కడుగుకొని, తరువాత ముఖము కడుగుకొందురు; గోళ్లు పొడవుగా పెంచుకొందురు. వారు ఒంటరిగా భోజనము చేయుదురు; భోజనానికి ముందు తాంబూలము నమలుట, సారాయము (ద్రాక్ష) త్రావుట వారికలవాటు. జీనులేని గుర్రాలపై స్వారీ చేయుదురు, కత్తిని కుడివైపు వేలాడవేసి కొందురు; హస్తచాలనము చేయునపుడు ఎదటి మనిషి చేయిని మీకేయివైపు పట్టుకొనేవారు. ఇంటి యజమానిని అడుగకుండానే ఇంటిలో ప్రవేశించి, వెళ్లిపోయేముందు ఇంటి యజమానిని సెలవు అడుగుట వారి ఆచారము; సభలో సమావేశమైనపుడు కాళ్లు ముడుచుకొని కూర్చుందురు. దగ్గరనున్న పెద్దల యెడల గౌరవం పాటించకుండా కాండ్రించి ఉమ్మివేయడం, ముక్కు ఎగ పీల్చడం చేసేవారు. వస్తువులిచ్చేటప్పుడు ఎదుటివారిపైకి విసరి వేయుదురు. చతురంగం ఆటను నలుగురు ఆడేవారు.

ఇక దుస్తులు :- కొందరు మొలచుట్టూ ఒక మాసినబట్ట కట్టుకొనేవారు. ఇతరులు పాదాలదాకా జీరాడే పంచె కట్టుకొనేవారు. సిదర్ అనే ముసుగు తలను, ఛాతీ పైభాగాన్ని, మెడనూ, కప్పేటట్లు ధరించేవారు. పురుషులు కూడా స్త్రీల వలెనే చెవులకు దుద్దులు, భుజాలకు కంకణాలను ధరించేవారు. స్త్రీలు భుజము మీదినుంచి నడుము వరకూ కుర్తా లేక చిన్న చొక్కాలను వేసుకొనేవారు.

భారతీయులు గర్విష్ఠులనీ సంకుచిత స్వభావులనీ విమర్శించినా, అల్ బెరూనీ వారిలోని సద్గుణాలను వదలిపెట్టలేదు. 'దేవుడు' అంటే వారికి గల సరియైన జ్ఞానమును అతడు ఎంతో మెచ్చుకొన్నాడు. పతంజలి భాష్యము,

భగవద్గీత, చదివి, అతడు హిందువుల దైవ జ్ఞానమును గురించి వ్రాసిన మాటలు :– హిందువుల విశ్వాసము ప్రకారము దేవుడు ఒక్కడు. శాశ్వతమైన వాడు, ఆది అంతములు లేనివాడు ; స్వేచ్ఛ ననుసరించి వర్తించువాడు ; సర్వశక్తి మంతుడు, అన్నియు తెలిసిన వాడు ; నిత్యజీవి ; జీవనదాయకుడు ; పరిపాలకుడు ; రక్షకుడు.''

అయితే ఈ విశ్వాసము హిందువు లందరిదీ కాదు. దేవుడంటే చదువురాని సామాన్య ప్రజల భావాలు వేరు. అది తెలిసిన అల్ బెరూని వారి విగ్రహారాధనను నిరసించాడు.

అల్ బెరూని హిందువుల మతాచారములను చాల వివరముగా పరిశీలించాడు. హిందూ యాత్రికులు వారణాసి, పుష్కరము, థానేశ్వరము, ముల్తాన్ వంటి పుణ్యక్షేత్రాలకు తీర్థయాత్రలు చేసేవారని వ్రాశాడు. 'చనిపోయిన వారి అస్థి కలను గంగలో కలిపి, బీదలకు దానం చెయ్యడం వల్ల పుణ్యం వస్తుందని హిందువుల నమ్మకము' అని కూడా వ్రాశాడు. కొన్ని ఆహారపదార్థాలు శుద్ధముగా లేవని భావించి నిషేధించేవారు. పండుగ పర్వాలలో పుణ్యంకోసం ఉపవాసములు చేసేవారు. వారికి కొన్ని మూఢ విశ్వాసాలు ఉండేవి ; దైనిక జీవితంలో శకునాలకు చాలా ప్రాముఖ్యం ఇచ్చేవారు. తగాదాలను న్యాయ విచారణద్వారా కాక, ఒట్టులూ, ప్రమాణాల ద్వారాను, దివ్యములనే పరీక్షల ద్వారాను (అగ్నిపరీక్ష వంటివి) తీర్చుకొనేవారట.

ఆనాడు సమాజంలోని కులాల కట్టుబాట్లు చాలా కఠినంగానే ఉండినట్లు అల్ బెరూనీ వ్రాశాడు. హిందువులు ఇతర కులాలవారితో సంపర్కం జరుగ కుండా కట్టుదిట్టాలు చేసుకునేవారు. ఏ కులం వారైనా తాత ముత్తాతల నుంచి వచ్చిన వృత్తులే కాని వేరు వృత్తులను స్వీకరించకుండా నిషేధించారు. బ్రాహ్మణుడు తన జీవితమంతా మత సంబంధమైన కార్యకలాపమే అనుసరించాలి. అలాగే మిగిలిన ప్రతికులము వారూ తమకు సాంప్రదాయికముగా విధింపబడిన ధర్మములనే అనుసరించాలి. కాని ప్రతి వ్యక్తికి తన ఇష్టము వచ్చిన పద్ధతిలో

దేవుని ఆరాధించే స్వేచ్ఛ ఉండేది. తనకు విధాయకమైన వృత్తిని విడిచి, మరొకరి ధర్మమును అనుసరించడం సంఘ వ్యవస్థకు భంగకరము అని పాపముగా భావించేవారు. ఈ విధంగా కులానికి జన్మతో ముడిపడి, ఎదురు మాట లేకుండా అందరూ అనుసరించేవారు.

అల్ బెరూనీ వ్రాతలలో అంటరాని వారిని గురించి ఉన్నదా అంటే, ఉన్నదనే చెప్పాలి. అతని కాలంలో కూడా తక్కువ కులాల, అంటరానివారి స్థితి సమాజంలో హీనమైనది. అంత్యజు లనబడేవారు సమాజంలో శూద్రుల కంటే కూడా తక్కువ స్థితిలో ఉంటూ పట్టణాలకూ పల్లెలకూ బైట వెలివాడలలో ఉండేవారు. అంత్యజులలో మళ్ళీ ఎనిమిది కులాల వారున్నారు. మంత్రగాళ్లు, బుట్టలూ డాళ్లూ చేసేవాళ్లు, చేపలుపట్టే పల్లెవాళ్లు, అడవి జంతువులను పక్షులనూ వేటాడేవాళ్లు, బట్టలుతుకువాళ్లు, చెప్పులు కుట్టువాళ్లు, నేతగాళ్లు. వీరు కాక ఇంకా హాడి, దోమ, చండాల, 'భదాతా', అని ఏ కులానికీ చెందని వాళ్లుండేవారు. వీళ్లు గ్రామాలను శుభ్రపరచడం వంటి హీనవృత్తులు చేసేవారు. వారి వారి వృత్తులనుబట్టి వారిలో వారికి తేడాలుండేవి. అందరికంటే నీచమైన హోదా కలవారు చచ్చిన పశువుల మాంసం తినే 'భదాతా'లు.

కులాలు సాంఘికంగా ఒకరితో ఒకరు సంబంధం లేకుండా ఉండేవారు. ఒకే కులానికి చెందిన ఇద్దరు వ్యక్తులు కూడా ఒక్కచోట భోజనం చేస్తూఉంటే వారిద్దరికీ మధ్య మడిగా ఒకటోపి అట్టముక్కో ఉండేదట. ఒక్కొక్కప్పుడు ఇద్దరికీ మధ్య ఒక గీతగీసినా వారి మడి అవసరం తీరేదట. భోజనం ప్రతి వ్యక్తికీ వేరు వేరు కంచంలో వడ్డించేవారు కాని, ఉమ్మడిగా ఉండే పళ్లెంలో నుంచి ఒక్కడూ తనకు తాను తీసుకొని తినకూడదట.

పంచ సిద్ధాంతములలో వివరించిన రీతిగా భారతీయ ఖగోళ శాస్త్ర (సూర్య చంద్రులు నక్షత్రాలను గూర్చిన) జ్యోతిష శాస్త్రములలోని విషయములను అల్ బేరూని తన గ్రంథంలో వివరించాడు. భారతీయ సిద్ధాంతం ప్రకారం భూమి, గ్రహములు, వాటి పరిమాణములు, గతులూ, గ్రహ సంయోగము,



అల్‌బెరూని ప్రాచీన చిత్రము

సూర్య చంద్రగ్రహణములు, అక్షాంశములు, రేఖాంశములు, ఖగోళ పరిశీలన సాధనములు మొదలయిన వైజ్ఞానికాంశములను వర్ణించాడు. భారతీయ గణిత

శాస్త్రజ్ఞులు, ఖగోళ శాస్త్రజ్ఞులు, ధీమంతులే కాని, తమ విజ్ఞానం ద్వారా ప్రదర్శించ గల సత్ఫలితాలను సాధించ లేకపోయారు.

భూగోళమూ, ద్రవ్యమూ, ఆకాశమూ, కాలమూ మున్నగు వాటి సృష్టిని గురించీ, వాటి మాన పరిమాణముల వివరాలను గురించీ సాంప్రదాయికంగా పురాణాలలో వున్నాయి. ఆ భావాలను గుడ్డిగా నమ్మడంవల్ల విజ్ఞాన పరిశోధ నావకాశాలకు కొంత అవరోధం కలిగిందని అల్ బెరూని వ్రాశాడు.

ఖగోళ శాస్త్రానికి వలెనే వైద్య శాస్త్రానికి కూడా ఉన్నత విద్యా గౌరవం ఉండేది. వైద్యశాస్త్ర విద్వాంసులలో ఉత్తముడైన చరకుని గ్రంథము అరబ్బీ భాషలోనికి తర్జుమా అయినది. పాముకాటుకు మంత్రములు తప్ప వేరే మందు లేదని విశ్వసించేవారు (ఆనాడు కూడ).

హిందువులు హీనలోహాలను బంగారముగా మార్చే స్వర్ణవిద్యను వినియో గించేవారు. అంతేకాదు రోగులకు మంచి ఆరోగ్యమును, యౌవనమునూ ఇచ్చే రసాయన విద్య బాగా వినియోగించే వారని అల్ బెరూని వ్రాశాడు.

రసాయన చికిత్స వలని ఫలితాన్ని నిరూపించే కుతూహలం పుట్టించే కథ లను కొన్నింటిని అల్ బెరూనీ వ్రాశాడు. మాళవదేశంలో ధారానగరపు రాజ యిన భోజదేవుని కోటలో కనబడే పొడవైన వెండి దిమ్మను గురించి ప్రచారంలో ఉండిన కథ ఇలాగ వివరించాడు.

ఒకనాడు మాళవరాజు వద్దకు ఒకడు వచ్చి, తన దగ్గర ఒక రసాయన ఔషధమున్నదనీ, చావు లేకుండా చేసే రహస్య చికిత్స తనకు తెలుసుననీ గొప్పలు చెప్పుకున్నాడు. మరుగుతున్న నూనె తొట్టిలోనికి రాజు దూకాలి. ఆ తరువాత వేరు వేరు సమయాలలో తొట్టెలో వేరు వేరు ప్రత్యేక చూర్ణములను కలుపుతూ వస్తే, రాజు మృత్యువును జయించిన వాడవుతాడు. కాని, రాజు భయపడి, మరుగుతున్న నూనెలోనికి దుముకడానికి నిరాకరించాడు. తన వాదమును ఋజువు చెయ్యడానికి ఆ వైద్యుడే ఆ యా సమయాలలో ఆ యా



మరుగు నూనె గోళెంలో మనిషి

క్రమంలో ఆయా చూర్ణాలను తొట్టిలో కలపమని రాజుకిచ్చి, తానే మరుగునూనె తొట్టిలోనికి దుమికాడు.

మొదట ఆ మనిషి ముద్ద అయిపోయాడు. కాని, రాజు వేరు వేరు చూర్ణాలను కలుపుతూంటే మళ్ళీ ఆకారం వచ్చింది. ఇంక చిట్టచివరి పొట్లం విప్పి, చూర్ణం కలిపేముందు రాజుకి "ఒకవేళ వీడు మృత్యువులేని వాడయితే నా రాజ్యాన్ని జయిస్తాడు" అని తోచి, ఆ చివరి చూర్ణం తొట్టిలో వెయ్యలేదు. తొట్టె చల్లబడినప్పుడు అందులో గట్టిపడిన వెండిదిమ్మ కనబడిందట.

అల్ బెరూనీ తన కాలంనాడు భారతదేశంలో ఉపయోగిస్తున్న తూనికల మానాలను, కొలతల మానాలను వివరించాడు. తూనికల మానాలు ఒక ప్రాంతంలో ఉన్నట్లు మరొక ప్రాంతంలో ఉండేవి కావు. ఆధారమైన యూనిట్‌కు ఎక్కడి కక్కడి సంప్రదాయమే ప్రమాణము — ఎందుకంటే దానికి తిరుగులేని కట్టుబాటు ఉండేదికాదు. ఒక తూనికలోని అంతర్విభాగాలు ఇదమిత్థమని నిర్ణయించడానికి వీలుండేదికాదు. వేరు వేరు రకాల వస్తువుల తూనికలు స్పష్టంగా వేరుపరచి చెప్పడానికి వీలులేక తూనికలు తప్పుతూండేవి. దూరాల కొలతలలో కూడా అదే జరిగేది. ఉదాహరణకి నడిమివ్రేలి కొసకూ బొటన వ్రేలుకూనడిమి దూరము 'తాల్' అనేవారు. ఒక వ్యక్తి ఎంత పొడవున్నాడంటే అతని చేతిలోని 'తాల్'తో కొలిస్తే దానికి ఎనిమిదిరెట్లు పొడవుంటాడు. మనిషి మనిషికీ ఈ తాల్ భేదించడంచేత కొలవడానికి సరిసమాన ప్రమాణం (యూనిట్) లేకపోయింది.

హిందువులు ఎడమనుంచి కుడివైపుకు వ్రాసేవారు. దక్షిణదేశంలో తాటి ఆకులపై వ్రాసి, వాటిని ఒక త్రాటితో కట్టి ఉంచేవారు. ఉత్తరదేశంలో భూర్జ (తజ్) వృక్షపు బెరడును నూనెలోముంచి, మెరుగుతెప్పించి, అది గట్టిపడి నున్న పడ్డాక, దానిపైని వ్రాసేవారు. ఆ పత్రాలను ఒక గుడ్డలో చుట్టి జాగ్రత్త పెట్టే వారు. దానిని 'పొత్తి' 'పోథీ', పుస్తకము అనేవారు. దేవనాగరి లిపికి తోడు ప్రతి ముఖ్య ప్రాంతంలోను ఒక సొంత లిపి వాడుకలో ఉండేది. సృష్టి చిహ్నమైన ఓంకారముతో హిందువులు తమ ప్రతి వ్రాతా ప్రారంభించేవారు. ఆ




గుర్తు వారికి శుభదాయకం అనే కాకుండా, అది దేవుని ఏకత్వంలో వారి విశ్వాసాన్ని ప్రకటించేది.

అల్ బెరూనీ వర్ణించిన ప్రకారం 11 వ శతాబ్దపు భారతదేశ స్వరూపంలో మనకు కనబడేవి – సంకుచిత స్వభావం గల ప్రజలు – మార్పునకు లొంగని స్వభావం– తప్పు దిద్దితే ఒప్పుకోరు; కుల వ్యవస్థ బాగా వేరు నాటుకొన్నది– హ్యూయెన్‌త్సాంగ్ వచ్చినప్పటి బహిరంగ చర్చలూ, వస్తుతత్వ విచారమూ వెనకబడిపోయి, అల్ బెరూనీ నాడు అర్థం లేని కర్మకాండా పట్టుదలతో కూడిన ఆచారాలూ ఎక్కువైనాయి. ప్రజలు అనేక విషయాలలో అభివృద్ధి చెంది, బుద్ధి వికాసం కలిగిఉన్నా, నిష్ప్రయోజక విషయాల నుంచి ప్రయోజనకర విషయాలను మూఢ విశ్వాసాల నుంచి యధార్థ తత్వమునూ వేరుపరచి తెలిసికో లేని స్థితిలో పడిపోయేరు. అల్ బెరూనీ కళ్లకు కట్టేటట్టు ఏమని వ్రాశాడంటే:

“వారు అయోమయపు గందరగోళ పరిస్థితిలో పడిపోయారు. తార్కిక విచారణ పూర్తిగా లోపించి, సామాన్య ప్రజాసమూహపు వెర్రినమ్మకాల ప్రవాహంలో కొట్టుకొనిపోవడం. వారి గణిత శాస్త్రజ్ఞానము, ఖగోళ శాస్త్రజ్ఞానమూ ఎలాటిదంటే, ముత్యాలనూ ఉప్పు ఖర్జూరపు కాయలను కలగలిపితే ఏలాగుం

## 11 వ శతాబ్దపు భారతీయ నాణెములు



టుందో, లేదా ముత్యాలూ, గోమయమూ కలిపితే ఎలా వుంటుందో అలాగ, లేదా
అమూల్యమైన స్ఫటికాలూ గులకరాలూ కలగబోస్తే ఎలాగుంటుందో అలాగ!
వైజ్ఞానిక దృష్ట్యా ఆలోచించి నిర్ణయాలు చేసుకునే స్థాయిని ఇంకా అందుకోక
పోవటం వల్ల వారికి ఈ రెండు రకాల పదార్థాలూ సమానంగా కనిపిస్తాయి.



# ఈ శ్రేణిలోని పుస్తకములు

| | |
|---|---|
| **బాపు** (మహాత్మాగాంధీ జీవిత చరిత్ర సచిత్రముగా రెండు భాగాలు) | రచన, చిత్రములు : ఎఫ్. సి. ఫ్రెయిటాస్ |
| కాశ్మీరు | ఛాయా చిత్రములు : పి. ఎన్. శర్మ<br>రచన : మాలాసింగ్ |
| పక్షుల లోకం | జమాల్ ఆరా |
| మన నదుల కథ – మొదటి భాగము | లీలా మజుందార్ |
| హిమాలయ శిఖరాలు | బ్రిగడియర్ గ్యాన్ సింగ్ |
| విదేశీయుల భారతదర్శనం | కె. సి. ఖన్నా |
| మన రైల్వేల కథ | జగజీత్ సింగ్ |
| సరస, వినోద కథలు | మనోజ్ దాస్ |
| స్వర్గయాత్ర - ఇతర కథలు | లీలావతి భాగవత్ |
| స్వాతంత్ర్య గాథ | విష్ణుప్రభాకర్ |
| ఒక నాటకం వేద్దాము | ఉమా ఆనంద్ |

వెల : రూ. **2-50** ప్రతి

**ఈ పుస్తకములు భారతదేశంలోని అన్ని భాషలలోను లభించును.**